# శారద

[గూడూరు సంస్కృతీ సమ్మేళనంవారి అష్టమవార్షికోత్సవము సందర్భంలో '62 మే నెలలో నిర్వహించిన నాటకపోటీలలో ద్వితీయ బహుమతి నందుకున్న నాటకం]



గన్నిశెట్టి వెంకటేశ్వరరావు



ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ-2

ప్రథమముద్రణ :

అగష్టు 1962

వెల : రు 1-50

ముద్రణ

వెంకటరత్నా ప్రింటర్స్,

విజయవాడ-2

# అంకితం

సుప్రసిద్ధ సినీదర్శకులు, నిర్మాత
శ్రీ యల్. వి. ప్రసాద్‌గారికి
గౌరవాభివందనములతో

—గన్నిశెట్టి

2U - 256

# రచయితగా నా మాట

శారదమ్మకు నిజమైన తండ్రి శ్రీ దేశిరాజు జగన్నాధరావుగారే। నేను కేవలం దత్తతచేసుకున్నాననే చెప్పాలి

మిత్రులు జగన్నాధరావుగారు, ఈ కథను బుర్రబద్దలుచేసుకుని ఆలోచించి నాకు ధారపోశారు. వారి రుణ మెలా తీర్చుకోగలను?

అలాగే ఈ నాటకం వ్రాయటానికి నా వెంతో సహకరించిన మిత్రులు శ్రీ బి. సాంబశివరావుగారికి, ఇంద్రకంటి వెంకటరమణమూర్తి (ఆనాటి విజయకళాసమితి కార్యదర్శి) గారికి కృతజ్ఞతలు తెలుపుకోకుండా ఎలావుండగలను?

ఈ నాటకాన్ని విజయకళాసమితి (డివిజనల్ అక్కౌంట్స్ ఆఫీసు విజయవాడ) వారికోసం 1961 ఆగష్టునెలలో వ్రాశాను.

ఆంధ్ర నాటకకళాపరిషత్‌వారు గుడివాడలో నిర్వహించిన నాటకపోటీలలో 'శారద' ను ప్రదర్శించాలని పాపం వారీ నాటకం నాలో వ్రాయించుకున్నారు. ఎంతో శ్రమించి దీనిని ప్రదర్శనకు సిద్ధం చేసుకున్న విజయకళాసమితివారి ఆశను నిరాశగా మార్చారు ఆంధ్ర నాటకకళాపరిషత్తు నిర్వాహకులు.

ఆ తర్వాత వారు దీనిని అఖిలభారత చేనేతసప్తాహం ఉత్స వాలలోనూ, శ్రీరామనవమిఉత్సవాలలోనూ జయప్రదంగా ప్రదర్శించి ప్రజాభిమానాన్ని చూరగొన్నారు.

ప్రదర్శనలు జయప్రదంకావటానికి కృషిచేసిన విజయకళాసమితి సభ్యులకు,దర్శకత్వభారంవహించిన శ్రీ బి.సాంబశివరావుగారికి, సంగీతం సమకూర్చిన పూజ్యులు శ్రీ వేపా నరసింహారావుగారికి నా హృదయ పూర్వకమైన కృతజ్ఞతాభివందనములు అర్పించుకొంటున్నాను.

శారదను మీ కందిస్తున్న శ్రీ గద్దె లింగయ్యగారికి నా కృతజ్ఞతలు వ్యక్తంచేస్తున్నాను,

ఈ శారదవిషాదగాధను సానుభూతితో అర్ధంచేసుకుని ప్రదర్శించవలసిందిగా నాటకసమాజాలవారిని ప్రార్థిస్తున్నాను.

మీ

గన్నిశెట్టి

# పాత్రలు

| | | |
|---|---|---|
| కేశవరావు | : | వయస్సు 50 సం ॥ |
| రామారావు | : | వయస్సు 30 సం ॥ |
| జనార్ధనరావు | : | వయస్సు 45 సం ॥ |
| శేఖరం | : | వయస్సు 23 సం ॥ |
| కుటుంబరావు | : | వయస్సు 45 సం ॥ |
| శారద | : | వయస్సు 17 సం ॥ |

కాలం : వర్తమానం

స్థలం : కేశవరావుగారిఇల్లు

దృశ్యాలు: నాలుగు

# శారద

[ఒకటవ దృశ్యము]

[కేశవరావుగారి ఇల్లు. క్రింది అంతస్థులోని మధ్య హాలు. విశాలమయిన ఆ హాలులో తగుమాత్రం ఫర్నిచరు ఉంది. గోడలకు పురాణపురుషుల, జాతీయనాయకుల పటాలు, వర్ణచిత్రాలు తగిలించివున్నయ్.

ఎదురుగా ఇంటిలోనికివెళ్లే వాకిలి వుంది. దానిపై భాగంలో మధ్యవయస్కురాలయిన స్త్రీఫొటో (పెద్దసైజుది) వుంది.

కుడిచేతిప్రక్కన ఇంటిలోపలిభాగానికి వెళ్ళే మరో వాకిలి. దానిప్రక్కనే మేడపైకి వెళ్ళేందుకు మెట్లు—

ఎడమప్రక్కన వీధిలోనికివెళ్లేందుకు వాకిలివుంది. తెరలేచేసరికి-రంగంమీద ఎవ్వరూ లేరు.

సాయంత్రం ఆరున్నర ఐవుంటుంది. దూరాన్నుండి రేడియో మెల్లగా వినిపిస్తోంది.

ఒకనిముషం తర్వాత బయటివాకిలినుండి రామారావు వచ్చాడు. లాయరుదుస్తులు—చేతిలో ఒకటిరెండు ఫైళ్ళు వున్నయ్. కొంచెం బొద్దుగావున్నాడు.

హాలంతా ఒక్క-సారి కలయజూచి, చేతిలోని ఫైళ్ళను, జేబునుండి చాక్లెట్లప్యాకెట్టును తీసి, డ్రాయరుపైన వుంచి సరాసరి మేడపైకి వెళ్ళిపోతాడు.

కొన్నిక్షణాల తర్వాత, కుడిప్రక్క వాకిలినుండి కేశవరావుగారు వచ్చారు. చెమటతో తడిసిన బనీను, పైకి మడిచి కట్టిన ధోవతి, టవలుతో చెమట తుడుచుకుంటూ వొచ్చాడు. ఎదురుగావున్న తలుపు తెరుచుకుని లోనికి వెళ్ళిపోయాడు.

కొన్నిక్షణాలు నిశ్శబ్దంగా గడచిపోయినయ్.

తర్వాత, మేడపైనుండి రామారావు, మధ్యవాకిలి నుండి కేశవరావుగారు ఒకేసారి వచ్చారు. రామారావు మామూలు దుస్తుల్లో వున్నాడు. కేశవరావుగారు లాల్చి తొడుక్కుని వున్నారు.]

కేశ : ఎంతసేపవుతోంది నువొచ్చి?

రామా: ఇంతకుముందే. ఇవ్వాళ ఓక కేసు జడ్జిమెంటుంది. అందుకనే కొంచెం ఆలస్యమయింది.

కేశ : (పడకకుర్చీలో జారబడ్డాడు.)

రామా: (డ్రాయరు ప్రక్కనే వున్న కుర్చీలో కూర్చున్నాడు.) కమల ఉత్తరం వ్రాసింది నాన్నా.

కేశ : ఊఁ.

రామా: మీ ఆరోగ్యం జాగ్రత్తగా చూచుకోమని మరీ మరీ కోరుతూ వ్రాసింది.

(జేబులోనుండి ఇన్‌లాండ్ కవరు తీసి ఆయనకు అందించాడు.)

కేశ : (చిరునవ్వుతో) పిచ్చిపిల్ల! (ఉత్తరం చదువుకుంటున్నాడు.) బాబు ఊకొడుతున్నాడట కోయ్!

రామా: మంచిరోజు చూచుకుని వచ్చెయ్యమని రాద్దాం నాన్నా.

కేశ : బలేవాడివిలే! పిల్లతల్లితో డెవ్వరూ లేకుండా ఎలా వస్తుంది! ఎవరమో ఒకరం వెళ్లి తీసుకురావాలి గాని.

రామా: వాళ్ళవాళ్ళెవరో ఒకరు వస్తారుగా వెంట?

కేశ : అయినా మనం వెళ్ళి తీసుకరావటం బాగుంటుంది రా రామం. కొంచెం తీరుబడిచూచుకుని వెళ్ళి రాకూడదూ నువ్వు?

రామా: ఈ నెలంతా బిజీగానేవుంటుంది. ఎలా వెళ్ళటం?

కేశ : ఏదో ఒకరోజు వీలుచూచుకుని వెళ్ళాలి మరి; తప్పేదేముంది! (కొంచెమాగి) నాకు బాబు కళ్ళల్లోనే ఆడుతున్నాడురా!

రామా: (నవ్వుతూ) నాకు మాత్రం!

కేశ : శారద సరేసరి; రోజూ గోలే! (ఉత్తరం రామా రావుకు అందించాడు.)

రామా: ఆఁ, ఇంట్లో ఎవ్వరూ కనిపించరేం?

కేశ : ఎవరున్నారు కనిపించటానికి! వంటావిడకు జ్వరం తగిలిందట. రాలేనని కబురుపంపించింది. సరే, నరసన్న కూతురువద్దకెళ్ళి యింకాతిరిగిరాలేదుగా!

రామా: మరి ఈపూట వంటా ...అదీ...?

కేశ : ఎలాగో ఒకలా నేనే పూర్తిచేశాన్లే!

రామా: మీరా! హోటలునుంచి కేరియరు తెప్పించుకుంటే పోయేదిగా?

కేశ : ఆ హోటలుతిండి మరీ అధ్వాన్నంకదట్రా! శారదకు అసలే సయించదు.

రామా: శారద! మీరు శారదవిషయంలో మరీ ఇదిచూపకండి నాన్నా! మీగారాబం దాన్నిపాడుచేస్తోంది.

కేశ : (సన్నగా నవ్వాడు.) దానిమొహం! చిన్నతనం కదట్రా!

రామా: అలాఅని సరిపెట్టుకుపోతుంటే దానిబాధ్యతలనది తెలుసుకునే దెప్పుడు?

కేశ : ఆఁ,వయసొచ్చినకొందికీ అదే తెలుసుకుంటుందిలే! అయినా యింకెంతకాలం! రెండేళ్ళు మహావుంటే, ఆ తర్వాత దానిదారి నది పోక తప్పదుగదా! (చివరిమాటకు గొంతులో జీరవచ్చింది.)

రామా: వెళ్ళినచోట దా న్నది సమర్థించుకోగలగాలిగా?

కేశ : (సన్నగా నవ్వి లేచాడు) రామం! కనీసం వయసులోనైనా నీకన్నా పెద్దవాడినిరా!

రామా: (దెబ్బతిన్నాడు.) నాన్నా! మీ రలా ఫీలయితే నే నేం చెప్పగలను? శారదపైనున్న ప్రేమతో మీ కర్తవ్యాన్ని కొంచెం విస్మరించి, దానిని పెంచాల్సిన పద్ధతుల్లో పెంచలేకపోతున్నారని నాభావం.

కేశ : నువ్వు చెప్పింది తప్పుగా భావించటంలేదురా! కాని... కాని, దానిరెండవఏడు వెళ్ళకముందే మీ అమ్మ పోయింది. ఆనాటినుండి మీకు తల్లీ తండ్రీ అన్నీ నేనే అయ్యాను. (ఆగి)తల్లిలేని పిల్లల మనస్తత్వం.....ఎలావుంటుందో నాకు తెలుసు.

అది చాలా సున్నితం! ప్రతి చిన్నవిషయంలోను మీరెక్కడ బాధపడిపోతారోనని, అతిగారాబంగా మిమ్మల్ని పెంచుకొచ్చాను. నువ్వు శారదకన్న పెద్దవాడివి. కనకనే నీకు బాధ్యతలంటే కొంచెం తెలుసు. కాని శారద—అది పసికందు. అశుభం శుభం తెలియని వయసు, మనసు దానివి! అతిసున్నితమైన దానిహృదయం ఏ చిన్నబాధనూ ఓర్చుకోలేదు! అందుకే దాన్ని అతి జాగ్రత్తగా పెంచుకొస్తున్నాను. (A pause) అసలీస్థితిలో నేనూ లేననుకో!

రామా: నాన్నా!

కేశ: ఆఁ, మాటవరసకేలే! అప్పుడు శారదవిషయంలో నాలాగే, నాకన్న అధికంగానే ప్రవర్తించివుండేవాడివి నువ్వు!

రామా: (సాలోచనగా) ఔనేమో (కాస్తాగాడు) కాని,.... అతిగారాబంతో అదెందుకూ పనికిరాకండాపోతుందేమోనని నా భయం. అందుకనే కొంచెం కటువుగా ప్రవర్తించుతూంటాను. అంతేకాని...

కేశ: (చిరునవ్వుతో) కాని, నాకు తెలీదట్రా! శారదపైన నీకు నాకన్నా ఎక్కువ మమకారం! నీ మనసెలాంటిదో నాకు తెలీదా! (క్షణం నిశ్శబ్దం)

రామా: (వీధివాకిలివైపుచూచి) ఇప్పుడు ఏడున్నర కావొస్తోంది. శారద ఇంతవరకూ రాలేదు చూడండి. వయసొచ్చిన పిల్ల ఇంతసేపు బయటతిరగటం...

కేశ : వస్తుందిలే! నాకు చెప్పే వెళ్లింది. ఎవరో స్నేహితురాలి ఇంటికి వెళ్లొస్తానంటే, సరే వెళ్లిరామ్మా అని నేనే పంపాను.

రామా: (లోలోపలే నవ్వుకున్నాడు.)

కేశ : (టేబిల్ పైన దేనికోసమో వెదకుతున్నాడు.)

రామా: (దగ్గరగా వొచ్చి) దేనికోసం?

కేశ : ప్రొద్దున... సుందరాకాండ యిక్కడ పెట్టినట్టుగుర్తు.

రామా: (డ్రాయరుసొరుగు లాగి పుస్తకం వెదకి యిచ్చాడు.)

కేశ : (పుస్తకంతీసుకుని మేడపైకి వెళ్ళబోతూ ఆగాడు.) రామం!

రామా: (దగ్గరగా వెళ్ళాడు.)

కేశ : శారద వొస్తే.... దాన్నేమీ అనబోకు. అది....

రామా: (నవ్వుతూ) సరేలే నాన్నా.

కేశ : (పైకి వెళ్ళాడు)

రామా: (కుర్చీలో కూర్చుని ఫైలు తిరగేస్తున్నాడు)

[బయటనుండి శారద వొచ్చింది. సన్నగా, ఎర్రగా వుంది. కళకళలాడే ముఖం. హుషారుగా వచ్చి రామారావును చూడగానే టక్కున ఆగిపోయింది. క్షణ మలానే నిలబడి, పిల్లిలా అడుగులేస్తూ మధ్యవాకిలివేపు నడిచింది. లోనికి వెళ్ళబోతుండగా——]

రామా: శారదా! (ఆమెవేపు చూడకుండానే పిలిచాడు.)

శార : (ఆగిపోయింది.)

రామా: ఎక్కడి కెళ్ళా వింతవరకూ?

శార : .... ...

రామా: నిన్నే కదూ అడిగేది?

శార : మరి.... సుమతి.....

రామా: సుమతి?

శార : సుమతికి వంట్లో బాగుండలేదంటేను.....చూసి వద్దామని....వెళ్ళాను.

రామా: ఏ సుమతి?

శార : అదే....మన మూర్తిగారి.. . .

రామా: వాళ్లు ఊరికెళ్ళి మూడురోజులయిందిగా?

శార : (ఏదో అనబోయింది. కాని నోరు పెగల్లేదు.)

రామా: ఊఁ, అబద్ధాలుకూడా మొదలుపెట్టావన్నమాట?

శార : అది కా దన్నయ్యా....మరే....

రామా: మట్లాడకింక. రేపట్నుండి యిల్లుకదులు, నీపని చెబుతా!

శార : (తల వొంచుకొని నిలబడింది)

రామా: ఇన్నేళ్లొచ్చినా జ్ఞానంరాకపోతే ఎలా? ఈడొచ్చిన పిల్లవే! నీ ఇష్టమొచ్చినట్లు తిరగడమేనా ప్రొద్దు పోయేవరకు!

శార : (కళ్ళు తుడుచుకుంది)

రామా: చేతికందిన పిల్ల వుండగా, నాన్న చెయ్యికాల్చుకుని మనకు వండిపెట్టాలా ? ఒక్కపూట వంట మనిషి రాకపోతే వంటచెయ్యలేవూ?

శార:(ఏడుపుగొంతుకతో)వంటమనిషిరాదనినా కేం తెలుసు?

రామా: నీ కేదీ తెలియదు. తెలుసుకోవడానికి ప్రయత్నిస్తేగా తెలిసేది! అన్నీ తెలుసుకోవటం అవసరమనే చెబుతోంది.

శార : రేపట్నుంచి వంట నేనే చేస్తానే.

(విసురుగా లోని కెళుతోంది.)

రామా: (డ్రాయరుమీదవున్న చాక్ లెట్ ప్యాకెట్ తీసి) ఇవి తీసుకెళ్లు.

శార : (ఆగి చూచింది. మంకుగా—) నా కేమీ అక్కర్లేదు లే. (వెళ్ళబోతూంది.)

రామా: (తీవ్రంగా) శారదా!

శార : (ఆగింది)

రామా: తీసుకో ముందు.

శార : (భయంగా వొచ్చి ప్యాకెట్ తీసుకుంది)

రామా: నాన్న మేడమీదున్నారు.

[తను మధ్యవాకిలినుండి లోనికి వెళ్లిపోయాడు]

శార : హమ్మయ్య! (గట్టిగా శ్వాసలాగి వొదిలింది. క్షణమాగి మేడపైకి వెళ్ళబోతుండగా, కేశవరావుగారే దిగి వస్తూండటం చూచి ఆగిపోయింది)

కేశ : ఎంత సేపయిందమ్మా వొచ్చి?

శార : (కోపాన్ని నటిస్తూ) ఇప్పుడే.

కేశ : (తల నిమురుతూ) పిచ్చితల్లి!

శార : (విదిలించుకుని దూరంగా జరిగింది)

కేశ : ఏమిటమ్మా కోపం?

శార : మేటినీకి వెడతానని నీతో చెప్పివెళ్ళలా?

కేశ : అవును.

శార : అన్నయ్యతో సర్ది చెబుతానన్నావుగా మరి ?

కేశ : పక్కబజారులో స్నేహితురాల్ని చూట్టానికెళ్ళావని చెప్పానుగా !

శార : రాగానే అన్నయ్య చెడామడా తిట్టాడు మరి ?
(బుంగమూతి పెట్టింది.)

కేశ : (నవ్వుతూ) సినిమాకు వెళ్ళినదానివి ఇంత ఆలస్యంగా రావటం దేనికి చెప్పు ? వెంటనే వొచ్చేస్తే బాగుండేదిగా !

శార : దారిలో ఇంకో అమ్మాయి కలిసి పార్కుకి లాక్కెళ్ళింది - అదీ తప్పే ! అయినా అన్నయ్యది మరీ విచిత్రంలే నాన్నా ! అయినదానికీ కానిదానికీ తిడుతుంటాడు !

కేశ : (దగ్గరగా వచ్చి పైన చెయ్యివేశాడు.) అన్నయ్య కోప్పడేది నీ మంచికే నమ్మా!

శార : (విసురుగా) ఉహ్హుం !

కేశ : వయసొచ్చిన పిల్లవు. ప్రొద్దుపోయేవరకూ తిరగటం మంచిది కాదుగదమ్మా ! అందుకే కోప్పడుతాడు వాడు.

శార : నువ్వూ అన్నయ్యకు తాళ మేస్తున్నావన్నమాట ! సరేలే.

[చిప్పున లేచి లోనికి వెళ్ళబోయింది.]

కేశ : (పట్టుకుని) ఇంతమాత్రానికే కోపగించుకుంటే ఎలా తల్లీ !

శార : అంతేలే ! (లోనికి వెళ్ళిపోయింది.)

కేశ : తల్లీ ! [రెండడుగులువేసి ఆగిపోయాడు. మధ్య వాకిలి పైభాగంలోవున్న శారదతల్లిఫోటో దగ్గరగా వెళ్ళి, ఫోటోలోనికి చూస్తూ] లక్ష్మీ ! చిట్టితల్లి చూశావా ఎంత పెంకిగా తయారయిందో! నువ్వుంటే ఎంత మురిసిపోయేదానివో నీ తల్లిని చూచుకుని ! [కళ్ళు చెమ్మగిల్లినయ్.]

[బయటనుండి జనార్ధనరావుగారు వచ్చారు. చేతిలో బేగ్ వుంది. బలిష్టమయిన శరీరం. నవ్వుతూవుండే మొహం.]

జనా (వస్తూనే) ఏంరా కేశవా ! కులాసాగా వున్నావా !
[బేగ్ ఒక ప్రక్కన పెట్టాడు.]

కేశ : (చూచి సంతోషంగా) ఏరోయ్ జనార్ధనా ! ఇన్నాళ్ళకు గుర్తొచ్చానట్రా ! (వెళ్ళి కౌగలించుకున్నాడు.)

రామా:(లోపలినుంచి వచ్చాడు.) ఎవరు ? జనార్ధనం మామయ్యా ! నమస్కారం మామయ్యా!

జనా : ఏంవోయ్ రామం ! తండ్రివయ్యావు కాంవాలం ! పిల్లా తల్లీ క్షేమమేగా ?

రామా: ఆ, రండి కూర్చోండి.

జనా : సర్లే. అదీ నువ్వే చెప్పాలా ! కూర్చోక నిలబడే వుండడానికి నేనేమయినా కొత్తచుట్టాన్నా ?

[ముగ్గురూ కూర్చున్నారు. కేశవరావు, జనార్ధన

రావుగారు ఒకరిదగ్గరగా ఒకరు కూర్చున్నారు. రామా రావు కొంచెం ఎడంగా కూర్చున్నాడు.]

కేశ : అంతా బాగున్నారా ఇంటిదగ్గర ?

జనా : నిక్షేపంగా వున్నారు. అన్నట్లు-నీ అల్లుడు బి. ఎ. ఫస్టుక్లాస్‌లో ప్యాసయ్యాడురా కేశవా !

కేశ : అలాగా, చాలా సంతోషం.

రామా: మీరు వచ్చారంటే ఏదోఒక శుభవార్త మోసు కొస్తారని నాకు తెలుసుగా ! (నవ్వాడు)

జనా : ఆఁ. ఇంతకీ మా కోడలుపిల్ల ఎక్కడ ?

[బేగ్ తెరచి. బిస్కట్‌ప్యాకెట్, పూలపొట్లం తీశాడు.]

రామా: బిస్కట్లు తెచ్చారు ! మా ఇంట్లో చిన్నపిల్ల లెవరున్నారు మావయ్యా ?

జనా: అదేమిటి రామం అలా అంటావ్, మన శారద వుందిగా !

[అంతా నవ్వుతున్నారు.]

జనా : సరే, శారద ఎక్కడ ?

రామా : శారదా ! శారదా ! (మధ్యవాకిలివరకూ వెళ్లి పిలిచాడు.)

శార : [లోపలనుండే] వస్తున్నా అన్నయ్యా! (వచ్చింది.)

జనా : ఏం కోడలుపిల్లా, బాగున్నావా ?

శార : [ఆయనవంక చూచి, సిగ్గుతో తుఱుమని లోనికి వెళ్ళిపోయింది కుడిప్రక్క వాకిలిలోనుండి.]

జనా : ఓయ్ ఓయ్ ! శారదకు సిగ్గుకూడా తెలిసిందే !

కేశ : కాక ? ఎల్లకాలం చిన్నపిల్లగానే వుండిపొమ్మన్నావా ఏం ?

జనా : ఏమోలే ! నీ పెంపకం చూస్తుంటే నీతోపాటు మాక్కూడా శారదవయసు తెలియకండాపోతోంది.

[నవ్వులు.]

రామా : శారదా ! భోజనాల ఏర్పాట్లు చూడు.

[కేకవేశాడు.]

జనా : ఉండవోయ్. అప్పుడే తొందరేమిటి ? నీ కంత ఆకలిగావుంటే నువ్వు ముందు భోంచెయ్. తర్వాత మేం కూర్చుంటాం.

రామా : సరే, మీరు మాట్లాడుతూవుండండి. [ఫైలు తీసుకుని మేడపైకి వెళ్ళబోయాడు.]

జనా ; రామం !

రామా : (ఆగాడు.)

జనా : అర్జంటుపనులేమీ లేవుగా ?

రామా : అంత అర్జంటేమీ లేదులే. దేనికి ?

జనా : ఐతే కూర్చో. మీ అయ్యా కొడుకులతో కొంచెం మాట్లాడాలి,

రామా : (దగ్గరలో నిలబడ్డాడు.)

కేశ : ఏమిటోయ్ జనార్ధనా ! కొత్త పద్ధతిలో మాట్లాడుతున్నావు ?

జనా : అవునోయ్ ! మీ సంగతి తేల్చుకోవడానికే వచ్చాను.

కేశ : ఏమిటోయ్ !

జనా : (గొంతుసవరించుకుని) ఆఁ, అదే చెబుతున్నాను. (నస్యంపట్టు పట్టి, ముక్కు తుడుచుకుని) చూశు రామం !

రామా: ఏం మాఁవయ్యా ?

జనా : అదేమిటి నిలబడేవున్నావ్ ? కూర్చో మరి.

రామా: (కూర్చున్నాడు.)

జనా : చూడు రామం ! నేనూ మీ నాన్న ఏఘడియలో కలిశామోగాని, ఆనాటినుండి ఈనాటివరకూ ఒక్క ప్రాణంగా వుంటున్నాం నీకు తెలుసుగా ?

రామా: అబద్ధమేముంది ?

కేశ : (చిరునవ్వు నవ్వాడు.)

జనా : అవునా ! మీ అమ్మవున్నప్పుడే మేం నలుగురం కలిసి ఒక నిర్ణయానికి వచ్చాం. నువ్వు చిన్నవాడివిగా వున్నప్పుడు. ఏమిటంటే - మాకు ఆడపిల్ల పుడితే నిన్ను మా అల్లుడిగా చేసుకోవాలని. (నిట్టూర్చి) సరే, భగవంతుడా అదృష్టాన్ని దూరం చేశాడనుకో. తర్వాత సూర్యం పుట్టాడు. అప్పుడు, ఈ ఇంట్లో ఆడపిల్ల పుడితే, ఆ ఇంటి కోడలు కావాలని తీర్మానించుకున్నాం. దైవానుగ్రహంవలన శారద పుట్టింది. పుట్టగానే సూర్యం పెళ్ళాం అని ముద్రవేశాం.

రామా: ఈ ఉపోద్ఘాతమంతా ఏమిటి మామయ్యా ! (నవ్వాడు.)

జనా : చెప్పనియ్యవోయ్ మరి ! మా ముసలివాళ్ళ మాటలు మీకు సోదిలా కనిపిస్తయ్ !

రామా : ఏమిటి మాఁవయ్యా ! మరీ పండుముసలివాడిలా మాట్లాడతారు !

జనా : కాదటోయ్ మరి ! అసలువిషయం _ మన దురదృష్టంకొద్దీ మీ అమ్మగారు పోయారనే చింత తప్ప, తతిమ్మా వ్యవహారాలన్నీ సజావుగానే వున్నయ్ గదా ! సూర్యంకూడా ఏదో ఫర్వాలేదనే స్థితికివచ్చాడు. శారదకూ వయస్సొచ్చింది.

[ఆయన చెప్పదలచుకున్నది బోధపడిందన్నట్లు సన్నగా నవ్వుకున్నాడు రామారావు. కేశవరావు కళ్ళవెంట ఆనందబాష్పాలు రాలినయ్.]

జనా : కాబట్టి, ఈ నెలలోనే వాళ్ళిద్దరికీ ఆ ముడిపెట్టేస్తే అందరికీ తేలికగావుంటుంది. మీఅత్తయ్యా నేనూ ఆమాటే అనుకున్నాం నిన్నరాత్రి. వెంటనే నన్నిక్కడికి తరిమిందనుకో. నాకన్నవిషయంలో ఆయన్ని అడగాల్సిందేమీ వుండదు. పోతే, నీ అభిప్రాయం... నువ్వు తథాస్తు అంటే...

రామా: ఏమిటి మాఁవయ్యా! వింతగా మాట్లాడుతున్నారు. పెద్దవాళ్లు మీరుండగా మధ్య నన్ను అడగడమేమిటి? మంచో చెడో మీరు నిర్ణయించిన దానికి నేను కాదంటానా ? అయినా సూర్యం నాకు పరాయివాడా! మీ ఇష్టప్రకారం కానివ్వండి.

జనా : నువ్వలా అంటావని నాకు తెలుసులేవోయ్ అల్లుడా ! కాని, నువ్వు చిన్నవాడివి చితకవాడివి కాదుగా! అందుకనే నీతోకూడా ఒకమాట అంటే పోతుందిగదా అని. సరే, నీవిషయం ఐపోయింది.... ఇక మా కేశవుడు....[నవ్వుతూ]మా ఇద్దరిమధ్యా ఎగ్రిమెంటేగా ఇది ! ఇహ పోతే శారద...దాని ఇష్టంకూడా తెలుసుకుంటే....

రామా: మీాది మరీ చాదస్తం. దానిమొహం, దాన్నడగటమేమిటి?

జనా : అలా అనకోయ్. వెనుకటిరోజులా యివి ? పిల్ల నడక్కుండా పెళ్ళెలా చేస్తాం ?

కేశ : నోరుమూసుకోరా. మరీను; నీకు మతేమయినా పోతోందేమిటి? చిన్నపిల్ల దాని కేంతెలుసు దాని మొహం. అయినా సూర్యం దానికి కొత్తా ?

జనా : ఎందుకయినా మంచిది. దానిచెవినికూడా వేసి...

కేశ : నీమొహం! ఊరుకోరా యిక.

జనా : ఆహా....మర్యాదకోసమే ఒకమాటు. ....

కేశ : ఐతే నీకొడుకు నడిగే వచ్చావా మరి?

జనా : ఆఁ, వాడిమొహం. వాడేంచెబుతాడు? అయినా నామాట కెదురుచెబటం ఏనాడూ లేదుగా మా వాడు.

కేశ : ఐతే, నాపిల్లేనా నామాట వినకండాపోయేది ?

జనా : ఓరి నీదుంపతెగ, కొట్టావే దెబ్బ !

[ఇద్దరూ పగలబడి నవ్వారు. రామారావుకూడా కలిశాడు.]

జనా : సరే, ఐతే రేపే ముహూర్తం పెట్టిద్దాం.

కేశ : అలాగే.

రామా: సరే. భోజనాలకి లేవండి.

కేశ : జనార్ధనం! మీ రిద్దరూ భోంచెయ్యండి.

జనా : మరి నువ్వు?

కేశ : నేనిప్పుడు భోంచెయ్యలేను.

రామా: అదేమిటి!

కేశ : సంతోషంతో నాకు కడుపునిండిపోయిందిరా. నేను కొంచెం ఆగాక తింటాను. మీరిద్దరూ కాని వ్వండి.

రామా: లెండి మావయ్యా–శారదా! [అంటూ లోనికి వెళ్ళాడు కుడిపక్క వాకిలినుండి.]

కేశ : లే జనార్ధనం.

జనా : నువ్వు ఆగమన్నా ఆగలేనులే. ఆకలి దహించే స్తోంది.

[బాగ్ తీసుకుని లోనికి వెళ్ళబోయి, ఆగి టీపాయ్ పైనవున్న బిస్కట్ప్యాకెట్, పూలు తీసుకుని వెళ్ళాడు రామారావు వెళ్లినవేపుగా.]

కేశ : [భార్యఫొటోకి ఎదురుగా నిలబడి] లక్ష్మీ, నీ చిట్టి తల్లి పెళ్ళికూతురవబోతోంది. ఇవ్వాళ ఎంత మంచిరోజు! కాని, నువ్వు... నువ్వు...

[గొణుక్కుంటూ నిలబడి ఆఫొటోలోనికి చూస్తూ నిలబడి పోయాడు.]

చిట్టితల్లికి ఆ ముచ్చటకాస్తా తీరిపోతే శారదను శాంతమ్మ, జనార్దనంల చేతుల్లో పెడితే, నాకు ఏ దిగులుండదు లక్ష్మీ!

[వంటయింటినుండి శారద వొచ్చింది. ఆయన గమనించ లేదు.]

శార : (దగ్గరగా వెళ్ళి) నాన్నా !

కేశ : [త్రుళ్ళిపడ్డాడు] నువ్వా తల్లీ! వర్తన చెయ్యకండా యిలా వచ్చావేఁవమ్మా!

శార : మామయ్య ఊరికే చతురాడుతుంటాడు. నాకు సిగ్గేస్తుంది. అందుకని అన్నీ దగ్గరపెట్టి వచ్చేశాను.

కేశ : పిచ్చిపిల్ల ! (దగ్గరకు తీసుకుని తలనిమిరాడు.) ఇలా కూర్చో తల్లీ. నీ కొక మంచికబురు చెప్తాను.

[ఇద్దరూ సోఫాలో కూర్చున్నారు.]

శార : (కూర్చుంటూనే) ఏమిటి నాన్నా, అంత మంచి కబురు ?

కేశ : ఆఁ—ఇప్పుడు జనార్ధనం మామయ్య ఎందుకొచ్చాడో తెలుసా ?

శార : చూసిపోవటానికి.

కేశ : ఊఁహూఁ:

శార : మరి ?

కేశ : మామయ్య నీ పెళ్ళివిషయం మాట్లాడటానికొచ్చాడమ్మా !

శార : ఫో నాన్నా! నువ్ మరీను.

కేశ : ఎగతాళికాదమ్మా. నిజం చెబుతున్నాను, ఒట్టు.

శార : (ఆమెముఖంలో అకస్మాత్తుగా మార్పువొచ్చింది.)

కేశ : (తన ధోరణిలోనే) సూర్యంబావ బి. ఎ. ఫస్ట్ క్లాసులో ప్యాసయ్యాడట. అందుకని, ఈనెలలోనే మీఇద్దరికీ పెళ్ళిచెయ్యాలంటున్నాడు మామయ్య.

[ నవ్వుతూ ఆమెమొహంలోనికి చూశాడు. ఆమెలో ఉత్సాహం లేకపోవటం చూసి ఆశ్చర్యపడ్డాడు క్షణమాగి-)

కేశ : అమ్మా! శారదా !

శార : (త్రుళ్ళిపడింది.) ఆఁ.

కేశ : అలా వున్నావేం ?

శార : ఏ__ఏం లేదు.

కేశ : అత్తవారికింటి వెడితే నేను గుర్తుంటానా తల్లీ ?

శార : (సమాధానమివ్వలేదు.)

కేశ : (ఆమెముఖంలోనికి చూశాడు. ఆమెధోరణి అర్థంకాలేదు.) అమ్మా! (తలనిమిరాడు.)

శార : లేచి నిలబడింది.)

కేశ : (అనుమానంవేసింది.) లేచావేం ?

శార : తలనొప్పిగావుంది. పండుకోవాలి.

కేశ : (లేచి) ఇప్పటివరకూ బాగానే... ...

శార : (లోనికి వెళ్ళటాని కుపక్రమించింది)

కేశ : (ఆమెననుసరిస్తూ) రేపే లగ్నాలు పెట్టించాలనుకుంటున్నానమ్మా. నీ కిష్టమేనా మరి ?

శార : ...

కేశ : నాదగ్గర సిగ్గేమిటి తల్లీ ! చెప్పమ్మా ? (గడ్డం పట్టుకుని అడిగాడు.)

శార : అంత తొందరేమొచ్చింది నాన్నా ? (మనిషి గంభీరంగా మారిపోయింది.)

కేశ : అదేమిటి తల్లీ ! ఈడొచ్చిన పిల్లవు ! ఇంకెన్నాళ్ళాగుతాం ?

శార : ఇప్పుడు ........

కేశ : చెప్పమ్మా ?

శార : నాకు పెళ్ళొద్దు నాన్నా.

కేశ : (షాక్ తగిలినట్లయింది.) శారదా !

శార : అవును నాన్నా. మీరు తొందరపడి ప్రయత్నాలు చెయ్యకండి.

కేశ : అమ్మా !

శార : నా వివాహం విషయంలో నే నేమీ నిర్ణయించుకోలేదింకా.

కేశ : (క్షణంసేపు నిర్విణ్ణుడై పోయాడు. తేరుకుని) నిర్ణయించుకోవటాని కేమున్నదమ్మా ? సూర్యంబాప నీకు కొత్తవాడు కాదుగా ?

శార : (ఆలోచిస్తూ నిలబడింది.)

కేశ : ( దగ్గరగా వెళ్ళి భుజంమీద చెయ్యివేశాడు. )

చూడు తల్లీ ! నాకు పెద్దతనం వచ్చేసింది. ఏనిము షాన ఎలావుంటుందో తెలియదు.

శార : నాన్నా !

కేశ : మీ అమ్మను నువ్వెరుగవు. ఊహవచ్చినదగ్గర్నుండీ నా చేతులమీదనే పెరిగావు. నా కళ్ళముందే ఆ కాస్త ముచ్చట జరగాలని నా మనసు తహతహలాడుతోంది. నా మాట విను తల్లీ !

[శారద ఏదో చెప్పాలనుకుని చెప్పలేకపోతోంది.]

కేశ : తల్లీ !

[రామారావు, జనార్ధనం లోపలనుండి వచ్చారు.]

జనా : తండ్రీ కూతుళ్ళిద్దరూ ఏదో రహస్యం మాట్లాడుకుంటున్నారులాగుంది. మనం పైకివెడదాం పద వోయ్ రామం.

కేశ : అబ్బే ! మామూలు కబుర్లే, రండి.

జనా : వద్దులే. కాస్త చల్లగాలి మెయ్యాలిలే. పద రామం.

[ఇద్దరూ మేడపైకి వెళ్ళిపోయారు.]

కేశ : ( శారద దగ్గరగా వెళ్ళి ) నీ సందేహమేమిటి చెప్పమ్మా ? నాదగ్గర కాకుంటే ఇంకెవరి దగ్గర చెబుతావు ? చెప్పు తల్లీ ?

శార : నాన్నా ! (కంఠం రుద్ధమయింది.)

కేశ : తల్లీ !

శార : సూర్యంబావను నేను చేసుకోను నాన్నా.

కేశ: (నిశ్చేష్టుడయ్యాడు) ఏమిటమ్మా నువ్వనేది !?

శార : నిజమే నాన్నా.

కేశ : ఎందుకని శారదా ?

శార : .... ... ... ...

కేశ : చెప్పమ్మా, సూర్యానికి లోటేమిటి ? చదువు, సంస్కారం, అందం చందం అన్నీ వున్నవాడు, బహు యోగ్యుడు. పైగా మనకు బాగా కావలసినవాడు

శార : కాదనటం లేదు నాన్నా.

కేశ : మరి నీ అభ్యంతరమేమిటి ?

శార : ఎన్నివున్నా నా మనసుకు నచ్చాలిగా నాన్నా !

కేశ : అతనిలో ఏదయినా లోటుంటేగా నీకు నచ్చక పోవటానికి ?

శార : నే నతన్ని ప్రేమించటంలేదు. ప్రేమలేని దాంపత్యం ఎలా కుదురుతుంది నాన్నా ?

కేశ : శా ... ర ... దా ! నువ్వు ... నువ్వేనా మాట్లాడుతోంది !

శార : నాన్నా !

కేశ : (సోఫాలో కూలబడిపోయాడు.)

శార : (కొంచెందూరంలో నిలబడివుంది.)

కేశ : (క్రుంగిపోతూ) నీ బాగోగులు నాకన్నా ఆలోచించేవా ళ్లెవరమ్మా ఈ ప్రపంచంలో ! నీకు మంచిజరగని పని నీతండ్రి ఏనాడూ చెయ్యలేదు. శారదా! (లేచాడు.) నామాట కొంచెం వినమ్మా. జనార్థనం మావయ్య మన కెంత కావాల్సిన

వాడో నీకు తెలియందికాదు. నీవు పుట్టగానే నిన్ను సూర్యం భార్యగా అనుకున్నాం మేమంతా. మా నిర్ణయా లెలావున్నా సూర్యం నీకు అన్నివిధాలా తగినవాడు. అదీగాక, తల్లిలేని పిల్లవు, నిన్ను శాంతమ్మచేతిలో పెడితే, నాకు ఏ దిగులూ వుండదు. అన్ని విషయాలు ఆలోచించే ఈ నిర్ణయానికి రావటం జరుగుతోంది ఇప్పుడుకూడా. నువ్విలా అంటావని కలలోకూడా ఊహించలేదు శారదా!

శార : క్షమించు నాన్నా. ఈ విషయంలో నీమాట కాదనక తప్పటంలేదు.

కేశ : నువ్వెందు కిలా అంటున్నావో అర్థంకావటం లేదు శారదా! నీమనసులో వున్న దేమిటో చెప్పు?

శార : (ఏదో చెప్పాలని ప్రయత్నం. కాని చెప్పలేక పోతోంది.)

కేశ : (బుజ్జగింపుగా) చెప్పమ్మా?

శార : ఇప్పుడు నేనేమీ చెప్పలేను. నన్నేమీ అడగొద్దు నాన్నా!

కేశ : చెప్పకపోతే నీ మనస్సులోవున్న దేమిటో నా కెలా తెలుస్తుంది?

శార : ఈ పెళ్ళిమాత్రం నేను చేసుకోను. అంతకన్నా ఇప్పు డేమీ చెప్పలేను. నన్ను బలవంతంచేసి లాభంలేదు.

[రామారావు వస్తున్నాడు. మెట్లపైనుండి శారద చివరిమాటలు విన్నాడు. కోపంతో ఏదో అనబోయాడు. కాని, తమాయించుకుని అలానే నిలబడి వున్నాడు.]

కేశ : (నిరాశగా) జనార్దనం ఎంతో సంతోషంతో వచ్చాడు; వాడికీ కబురెలా చెప్పగలను? మనం కట్టుకున్నవన్నీ గాలిమేడలే, వెళ్ళిరా జనార్దనం అని ఎలా చెప్పను?

శార : (దగ్గరగా వచ్చి) బాధపడకు నాన్నా. మాంవయ్య మంచివాడు, చెబితే అర్థంచేసుకుంటాడు. ఎలాగో నచ్చచెప్పు.

కేశ : (బాధగా) శారదా! నీమాటకు తిరుగులేదా?

శార : (జవాబివ్వకండా, తలవంచుకుని లోనికి వెళ్ళి పోయింది)

[కేశవరావు అలానే నిలబడివున్నాడు. కళ్ళవెంట అశ్రువులు ప్రవహిస్తున్నాయ్. దూరాన్నుండి పాట వినిపిస్తోంది.]

ఇంతేలే... .... ఋణానుబంధం... ....
ఋణానుబంధం బింతేలే....
కని పెంచిన మమకారాలే
కనుకొలుకుల రాల్చును
బాష్పకణాలు
ఎవరికి ఎవరో ఈ జగతిని
ఎరుకరాదోయ్ విధివిలాసం
ఇంతేలే ఋణానుబంధం... ...

[రామారావు ఇంతసేపు తండ్రిబాధను గమనిస్తూ నిలబడివున్నాడు. నెమ్మదిగా దిగివచ్చాడు.]

రామా: నాన్నా !

కేశ : ... ... ....

రామా: (నెమ్మదిగా తలెత్తి కొడుకును చూచాడు. కళ్ళ వెంట నీళ్ళు కారుతున్నాయ్.)

రామా: ఏంజరిగింది ?

కేశ : ఏంలేదు.

రామా: శారద ఏమిటి అంటోంది :

కేశ : ... ... ....

రామా: ఏం నాన్నా ? శారద ఏమిటి అంటోంది ? (తీవ్రంగా అడిగాడు)

కేశ : నా ఖర్మ ! (నుదురుకొట్టుకున్నాడు.)

రామా: నేను చెబితే విన్నారా నాన్నా. కొంచెం భయ భక్తులతో పెంచమని మొదటినుండీ అంటూనే వున్నాను. నా మాట తేలిగ్గా తీసుకున్నారు. ఇప్పుడు చూడండి, శారద ఎలా తయారయిందో!

కేశ : (ఇంటిలోపలివేపుగా రెండడుగులు నడిచాడు.)

రామా: (తండ్రి ననుసరించుతూ) సూర్యా న్నెందుకు చేసుకోదట ?

కేశ : ఎంతడిగినా కారణం చెప్పదు.

రామా: ఊఁ. సరే, అంతా నేను కనుక్కుంటాను. మీరు పైకివెళ్ళి రెస్టతీసుకోండి.

కేశ : జనార్ధనానికి మొఖంచూపట మెలా ?

రామా: మీ రేమీ దిగులుపడకండి. శారద వివాహం సూర్యంతోనే జరిగితీరుతుంది. [కఠినత్వం ధ్వనించింది.]

కేశ : (అతనిగొంతుకలోని కఠినత్వానికి భయపడ్డాడు. రెండడుగులు వేసి ఆగి) రామం !

రామా: ఏమిటి ?

కేశ : దానికి నెమ్మదిగా నచ్చజెప్పు నాయనా !

రామా: అదంతా నాకు వదిలెయ్యండి. మీరు నిశ్చింతంగా వుండండి.

కేశ : దానిమనసు గాయపడితే........... (దుఃఖంతో కంఠం పూడుకపోయింది.)

రామా: మీ రేమీ ఆందోళనపడకండి. అన్నీ సవ్యంగానే జరుగుతయ్. పైకి వెళ్ళండి, మామయ్య ఒంటరిగా వున్నాడు.

[కేశవరావు నిదానంగా మేడపైకి వెళుతున్నాడు. రామారావు మెట్లకెగువవరకూ ఆయన్ను అనుసరించాడు. రామారావు ఆలోచిస్తూ కొంతసేపు అటూ యిటూ తిరిగాడు. మధ్యవాకిలివరకూ వెళ్ళి, ఉద్రేకం లేకండానే "శారదా! శారదా!" అని పిలిచాడు. కాస్సేపటికి శారద మధ్యవాకిలి ఖండీపచ్చింది. తలెత్తకండా గుమ్మంలోనే నిలబడివుంది.]

రామా: (చూచి) శారదా !

శార : (తలెత్తి చూచింది.)

రామా: ఇలా రా. రెండు నిమిషాలు నీతో మాట్లాడాలి. రా శారదా.

శార : (వచ్చింది.)

రామా: సూర్యాన్నెందుకు చేసుకోవు? (సూటిగా అడిగే శాడు.)

శార : (కంగారుపడింది. ఏంచెప్పాలో అర్థంకాలేదు.)

రామా; చెప్పు శారదా? (తీవ్రత తగ్గించి అడిగాడు. (భయ పడకు. నీ ఉద్దేశ్యమేమిటో నిశ్చయంగా చెప్పు?

శార ; (ఏదో చెప్పాలనుకుంటున్నా, మాట పెగలటం లేదు.)

రామా: (సన్నగా నవ్వాడు.) చూడు. శారదా! నీది అభం శుభం తెలియని వయస్సు! నాన్న పెంపకం నిన్ను మరీ తెలియనిదానిగా చేసింది. ఏది మంచో ఏది కాదో తెలుసుకోలేవు. ఒక్కటిమాత్రం సత్యం శారదా! మన బాగోగులగురించి మనకన్నా, మన తల్లితండ్రులకేఎక్కువ తెలుసు. సరయినమార్గాన్ని నిర్ణయించి మనల్ని సవ్యంగా నడిపించే బాధ్య తను వాళ్ళు తీసుకోవటమే మంచిది. అందులోనూ వివాహం జీవితంలో అతిముఖ్యమైన సమస్య. ఆ విషయంలో సరైననిర్ణయం జరక్కపోతే జీవితాలు దుఃఖభాజనాలవుతాయి. జీవితగమనంలో ప్రధాన మైన మలుపు శారదా వివాహం!

(కొస్తాగాడు.)

శార : (అచేతనంగా నిలబడివుంది.)

రామా: (ఆమెకు దగ్గరగా వెళ్ళి) అందుకే మన హిందూ ధర్మశాస్త్రం పిల్లలపెళ్ళివిషయంలో సరైననిర్ణయంచేసే బాధ్యతను తల్లిదండ్రుల కప్పగించింది. మనసులో అనేక ఆలోచనలు, కోర్కెలు వుండవచ్చు. కాని, అవి ఆచరణసాధ్యంకావు. ఉద్రేకంతో మనం చేసుకునే నిర్ణయాలు బ్రతుకును బాగుచేయవు. అవి బ్రతుకును మంటగలిపేందుకు సహాకరిస్తయ్.

శార : అన్నయ్యా! (అస్పష్టంగా, తనలోతానే అనుకుంది.)

రామా: అవునమ్మా! నాన్నకు నువ్వంటే ఎంతప్రేమో నీకు తెలియదా శారదా! అమ్మపోయినదగ్గరనుండీ తల్లీ తండ్రీ తనేఅయి మనల్ని పెంచాడు. మనల్ని యింతవాళ్ళను చెయ్యటానికి ఆయన ఎంతశ్రమించారో ఆలోచించు.మనపైన ప్రేమతో ఆయన ఎన్ని కోర్కెల్ని కూల్చివేసుకున్నారో! మనకు ఏబాధా కలగకుండా, కంటికిరెప్పలా కాపాడుకొచ్చారు. అటువంటి తండ్రి చేసిన నిర్ణయాన్ని అవివేకంతో మనం కాదంటే, ఆయన మన సెంత గాయపడుతుంది!

శార : (దుఃఖం [illegible] కొచ్చింది.) అ... న్నయ్యా!

రామా: (ఆమెను [illegible] దగ్గరకు తీసుకుని) మేమంతా నీక్షేమాన్నే కాంక్షిస్తాం శారదా! నీకు మంచిదరకనిదాన్ని మేము వాంఛించం. అన్నివిధాల ఆలోచించే

సూర్యంతో నీ వివాహం ఖాయంచెయ్యటం జరిగింది. దాన్ని నీవు కాదనకు.

శార : (కొంచెం ధైర్యం తెచ్చుకుని) కాని... మనసులేని వివాహం...

రామా: (తిరిగి అందుకున్నాడు.) మనసు అనేకవిధాల పరుగెత్తవచ్చు. వివేకం దాన్ని సవ్యమయిన మార్గంలోనికి మళ్ళించుతుంది శారదా! మనసును మనకనుగుణంగా మలచుకోవటం అలవరచుకోవాలి. ఈరోజు దేనిని మనసు తిరస్కరిస్తుందో రేపు దానినే గాఢంగా కాంక్షించవొచ్చు. ఈనాడు మంచిగా కనిపించినమార్గం రేపు కంటకావృతం కావొచ్చు. (స్థాయిమార్చి) ఐనా నీ మనసేంకోరుతుందో తెలుసుకునేశక్తికూడా నీకు లేదు!

శార : అయితే...

రామా: నీలో ఏ కోర్కెలు గూడుకట్టనివ్వకు. నీమనస్సులో ఏదైనా ఆలోచనవుంటే దాన్ని పూర్తిగా చెరిపెయ్. నీవు అనేది మరచిపోయి సర్వం నీ తండ్రేనని భావించు. నీ బ్రతుకునీ భవిష్యత్తునీ ఆయనచేతుల్లోపెట్టి నిశ్చింతగా వుండు. అంతా మంచే జరుగుతుంది.

శార : అలాగే నన్నయ్యా.

రామా: ఇక వెళ్ళు. (ఆలోచిస్తూ నడుస్తోంది శారద.) శారదా!

శార : (ఆగింది.)

రామా: (దగ్గరగా వెళ్ళి) నాకు ఒకమాటివ్వు శారదా.

శార : ఏమిటి?

రామా: నీపై నాన్నకున్న మమకారాన్ని ఆధారంగాచేసుకుని ఆయన్ను సమాధానపర్చటానికి ప్రయత్నించనని నాకు మాటివ్వు. నీపైనున్న ప్రేమతో ఆయన తాత్కాలికంగా నిర్ణయాన్ని మార్చుకున్నా, జీవితాంతం బాధపడతారు.

శార : సరే నన్నయ్యా!

రామా: జనార్ధనం మామయ్యకూ నాన్నకూవున్న సంబంధం ఎలాంటిదో నీకూ తెలుసు. ఇప్పుడీ నిర్ణయం మారిందంటే, వాళ్ళిద్దరిమధ్యా అగాధమేర్పడుతుంది.

శార : (భయంగా అతనివంక చూచింది.)

రామా: ఈ పెళ్ళి జరక్కపోతే నాన్న బ్రతకటం కష్టం. జాగ్రత్త!

శార : (భయంగా) నాన్నా!

రామా: నాన్న బ్రతకాలనుకుంటే, ఈ పెళ్ళికి వప్పుకో.

[గబగబ లోనికి వెళ్లిపోయాడు మధ్యవాకిలి తెరచుకుని. శారద అలానే నిలబడింది ప్రతిమలా.]

తెర

# శారద

[రెండవ దృశ్యము]

[అదేస్థలం. మరునాడు సాయంత్రం ఐదుగంటలకు శారద సోఫాలో కూర్చుని తీవ్రంగా ఆలోచిస్తోంది.

ఒక్కనిముషం తర్వాత బయట వాకిలిదగ్గర చప్పుడయింది. శారద తలత్రిప్పి చూచింది. ఎవ్వరూ లేరు. తిరిగి తనలోకంలో తను పడిపోయింది.

కాస్తాగి ఎదితలుపు తెరచుకుని శేఖర్ వొచ్చాడు. అందంగా అమాయకంగా వున్నాడు.

నెమ్మదిగా అడుగులేస్తూ శారదదగ్గరగా వచ్చాడు]

శేఖ : శారదా!

శార : (తృళ్ళిపడింది. అతన్ని చూడగానే చకితురాలయింది.) శే....ఖర్!

శేఖ : అవును, నేనే.

శార : (లేచి నిలబడి) నీ కేమయినా మతిపోయిందా? నువ్విక్కడికి....

శేఖ : ఫర్వాలేదు.

శార : వెంటనే వెళ్ళిపో.

శేఖ : ఇంట్లో ఎవ్వరూ లేరుగా?

శార : (ఆశ్చర్యంగా అతనివంక చూచింది.)

శేఖ : ఆవిషయం తెలుసుకునే వచ్చాను. అయినా ఇక మీదట ఎవ్వరికి భయపడదలచలేదు.

శార: శేఖర్!

శేఖ: అస లీరోజు మీవాళ్ళతో మాట్లాడి మరీ పోవా లనుకుంటున్నాను. (కూర్చున్నాడు.)

శార: (భయంగా) శేఖర్! వెళ్ళిపో ముందు.

శేఖ: వెళ్ళను శారదా! (నవ్వుతూనే అన్నాడు.) ఇక మీదట నీ వెక్కడుంటే అక్కడే నేనుకూడా!

శార ; ఎగతాళికాదు శేఖర్; నువ్వు వెళ్ళు వెంటనే.

శేఖ : నేనూ నిజమేఅంటున్నాను శారదా! (గంభీరంగా) ఇక ఎక్కడికీ వెళ్ళలేను. ఇప్పుడు నువ్వుతప్ప ఈ ప్రపంచంలో నా కెవ్వరూ లేరు.

శార : (కంగారుగా) ఏమిటిది శేఖర్?

శేఖ : అన్నిబంధాలు తెంపుకుని వచ్చేశాను.

శార. నీ మాటలు నా కేమీ అర్థంకావడంలేదు.

శేఖ: రాత్రిమానాన్నతో పోట్లాడిఇంట్లోనుండివచ్చేశాను.

శార: (ఆశ్చర్యంగా) రాత్రా! దేనికి?

శేఖ : మా నాన్న నా కేదో సంబంధం స్థిరపర్చి నన్ను పెళ్ళిచేసుకోమని బలవంతంచేస్తున్నాడు.

శార : (ఏదోగొణిగింది. అతనికి వినిపించలేదు.)

శేఖ : నేను అంగీకరించలేదు. దాంతో గొడవ బయలు దేరింది. మనప్రేమవిషయం ఆయనతో చెప్పాను. ఆయన అంగీకరించలేదు. ఆయన నిర్ణయాన్ని మార్చటానికి ఎన్నోవిధాల నచ్చచెప్పినా లాభం

లేకపోయింది. ఆయన ఊరునుండి వస్తూవస్తూ ముహూర్తం కూడా పెట్టించుకువొచ్చాట్ట. ఇటు సూర్యుడటు పొడిచినా తన నిర్ణయం మారదని స్పష్టంగా చెప్పారాయన. అందుకే.... (శారదవంక చూచాడు. ఆమె ప్రతిమలా నిలబడి ఆలోచిస్తోంది.) అందుకే ఇల్లువదలి వచ్చేశాను. ఏది ఏమైనా నిన్ను పెళ్ళాడితీరాలనే నిశ్చయించుకున్నాను. అందుకనే ఇవ్వాళ మీ నాన్నగారితో మాట్లాడాలనుకుంటున్నాను. (దగ్గరగా వెళ్ళి) ఏం శారదా?

శార : (గంభీరంగా) నువ్వు చేసిందీ, చెయ్యబోయేదీ మంచివి కావు శేఖర్;

శేఖ : శారదా! (ఆమె మొహంలోకి చూస్తూ) నీకోసం ఏత్యాగానికైనా వెనుకాడనని చెప్పానుగా!

శార : (తాపీగా) మీ నాన్నగారి ఇష్టప్రకారం నడచుకోవటం నీకు అన్నివిధాలా శ్రేయస్కరం శేఖర్!

శేఖ : మరోవిషయంలోనయితే అలాగే చేసివుండేవాడిని. కాని, ఇది....

శార : ఏవిషయమైనా అంతే. కన్నతండ్రికన్నా ప్రపంచంలో ఏదీ ఎక్కువకాదు. (గొంతుకలో జీరవచ్చింది.) వెంటనే వెళ్ళి మీనాన్నగారు నిశ్చయించిన పిల్లను పెళ్ళాడు.

[ఆమె మాటల్లో సహజత్వం కనుపించటంలేదు. ఏదో బాధతో మాట్లాడుతున్నట్లు స్పష్టమవుతోంది.]

శేఖ : [దగ్గరగా వెళ్ళి ఆమె మొహంలోనికి సూటిగా చూస్తూ] శారదా! నువ్వేనా యిలా అంటోంది? నేను వింటోంది నీ గొంతుకేనా?

శార : అవును శేఖర్! మన మంచి చెడ్డలు మనకన్నా మన పెద్దలకే బాగా తెలుస్తాయి. వాళ్ళు చెప్పి నట్లు నడుచుకోవటమే మంచిది.

శేఖ : శారదా! ఏమి టీ వేదాంతం!

శార : వేదాంతం కాదు, యదార్థం. మన కీ జన్మనిచ్చి, మనల్ని ఇంతవాళ్ళను చేసిన తల్లిదండ్రులకే మన భవిష్యత్తును వదిలేద్దాం.

శేఖ : నీకు మతేమయినా చలించిందా శారదా! ఏమిటి నీ ధోరణి? (భుజాలుపట్టుకు వూపాడు.)

[శారదకళ్ళవెంట అశ్రుధారలు చూచి చకితు డయ్యాడు.)

శారదా! ఏమి టిదంతా! అస లేం జరిగిందో చెప్పు?

శార : (అతన్ని వదిలించుకుని దూరంగా జరిగిపోతూ-) ఏమీ లేదు. నువ్వు వెళ్ళిపో ముందు.

శేఖ : నీ బాధ ఏమిటో తెలుసుకోందే నేను వెళ్ళను.

శార : శేఖర్ !

శేఖ : అవును.

శార : (కళ్ళుతుడుచుకుంటూ) మా నాన్నావాళ్ళొస్తారు. నువ్వు త్వరగా వెళ్ళు శేఖర్.

శేఖ : రానివ్వు. వారితో అన్నివిషయాలు మాట్లాడే వెళతాను. [కూర్చున్నాడు]

శార : (అదిరిపోయింది.) వద్దు శేఖర్, నా మాటవిను. నువ్వు ఎవరితోనూ మాట్లాడనక్కరలేదు. నీ దారిన నువ్వు వెళ్ళిపో.

శేఖ : ఏం?

శార : దానివలన ప్రయోజనం వుండదు.

శేఖ : నువ్వు చెప్పేదేమిటో స్పష్టంగా చెప్పు శారదా?

శార : [మాట్లాడలేదు. కుమిలిపోతుంది]

శేఖ : [లేచి దగ్గరగా వొచ్చి] శారదా!

శార : నీలాగే నాకూ మరొకరితో వివాహం నిశ్చయమైంది శేఖర్!

శేఖ : [నెత్తిన పిడుగు పడినట్లయింది] ఆఁ! ఇది కలా నిజమా భగవాన్! [కుర్చీలో కూలబడ్డాడు]

శార : [పొంగివచ్చే దుఃఖాన్ని ఆపుకోవటానికి ప్రయత్నిస్తోంది]
[కొన్నిక్షణాలు అలానే వుండిపోయారిద్దరూ]

శేఖ : (తేరుకుని లేచి ఆమెదగ్గరగా వెళ్ళి) ఏమిటిదంతా! నిజమేనా?

శార : అవును. రాత్రే నా కలలు కరిగిపోతున్నవని, ఇన్నాళ్ళూ గాలిమేడలలో కాలం గడుపుతున్నానని తెలుసుకున్నాను.

శేఖ : శారదా! (దుఃఖంతో కంఠం పూడుకపోయింది.)

శార : యిప్పుడు మా నాన్నావాళ్లు లగ్నం స్థిరపర్చుక రావటానికే వెళ్ళారు.

శేఖ : నీ ఇష్టం లేకుండానేనా?

శార : నా ఇష్టాయిష్టాలతో పనేముంది?

శేఖ : ఇష్టంలేనిపెళ్ళి కెలా వప్పుకుంటున్నావు?

శార : వప్పుకోక తప్పేదేముంది?

శేఖ : ఎందుకు ఎదిరించవు?

శార : .... ....

శేఖ : చెప్పు శారదా... ఎందుకు ఎదిరించ లేవు?

శార : లాభంలేదనే....

శేఖ : కొన్ని గంటలకాలం నీలో యెంత మార్పుతీసుకొచ్చింది శారదా! ఇంత పిరికితనం నీలో ఎలా ప్రవేశించింది?

శార : (మాట్లాడ లేదు. ఏడుస్తూ నిలబడివుంది)

శేఖ : అసలు నిజంగా నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా? (తీవ్రంగా అడిగాడు.)

శార : శేఖర్!

శేఖ : నిజంగా నన్ను ప్రేమిస్తుంటే మరొకర్ని యెలా పెళ్ళాడతావు?

శార : ... ...

శేఖ : చెప్పు శారదా?

శార : నేను నిన్ను ప్రేమిస్తున్నానో లేదో ఆ భగవంతుడికే తెలుసు.

శేఖ : ఐతే, ఆ విషయాన్ని మీవాళ్ళముందు ఎందుకు చెప్పలేవు?

శార : నాబ్రతుకు నీకు తెలియదు శేఖర్! నన్ను క్షమించు. నన్నింకేమీ అడక్కు. గడచిందంతా ఒక కల అనుకో. నన్ను పూర్తిగా మరచిపో.

శేఖ : ఎంత తేలిగ్గా చెబుతున్నావు శారదా! అణువణువునా నిండిపోయిన ఆశలను తుడిచివేసుకోవటం అంత తేలికనుకున్నావా శారదా!

శార : (దుఃఖం పెల్లుబికింది)

శేఖ : నువ్వులేకుండా నీ శేఖర్ బ్రతగ్గలడా! నిన్ను వొదిలి నీ ఛాయ ఎక్కడికెళుతుంది?

శార : (హృదయం బ్రద్దలయింది) శేఖర్! వెళ్ళిపో శేఖర్. నువ్వు నా యెదట వుంటే నా గుండెలు బ్రద్దలవుతయ్. వెళ్ళు వెళ్ళు.

[మొహం చేతులతో కప్పుకొని భోరుమంది.]

శేఖ : (దగ్గరగా వెళ్ళి ఆమెచేతులు పట్టుకున్నాడు.) శా....రదా!

[కొన్నిక్షణాలు అదేస్థితిలో వున్నారు.]

శేఖ : అర్థమయింది. నిన్నేదో భయం ఆవహించింది. నీ మెడ కెవరో ఉచ్చుబిగించారు. నీ ఆత్మనీ, నీ స్వేచ్ఛనీ నొక్కేస్తున్నారు! కాని.... కాని అలా

జరగడానికి వీల్లేదు. మనమార్గాన్ని యే శక్తులూ నిరోధించలేవు. నానుండి నిన్నెవ్వరూ వేరుచెయ్యలేరు. (చెయ్యిపట్టుకుని) శారదా! యీ పంజరం నుండి తప్పించుకపోదాం.

శార : శేఖర్!

శేఖ : భయపడకు. ఈ బంధాలన్నీ తెంపుకొని స్వేచ్ఛగా బ్రతుకుదాం. వెంటనే బయలుదేరు. ఈ రాత్రే ఎక్కడికో పారిపోదాం. మనం బ్రతకలేమన్న భయుంవొద్దు. ఆఖరికి రిక్షాలాగయినా సరే నిన్ను పోషిస్తాను. రా వెళదాం. (చెయ్యి పట్టుకొని లాగాడు.)

శార : ఉద్రేకపడకు శేఖర్. అంతసాహసం మంచిది కాదు.

శేఖ : ఇప్పుడు ఏసాహసం చెయ్యకపోతే మన బ్రతుకులు బలవుతాయి శారదా!

శార : అందుకని, యిలా పారిపోవడం తప్పుకదూ?

శేఖ : తప్పు ఒప్పులను నిర్ణయించుకోవటానికిది సమయంకాదు. ముందీ నరకంనుండి తప్పించుకోవాలి. నీకు నేను కావాలనుకుంటే నాతో వచ్చెయ్. మనం సుఖపడతాం.

శార : (శూన్యంలోనికి చూస్తూ నిలబడింది.)

శేఖ : నామాట విను శారదా. (దీనంగా అన్నాడు.)

శార : (బాధగా) మానాన్న ... మా నాన్నను వదిలి ఎలా రాగలను? నేను లేకపోతే మా నాన్న బ్రతకడు.

శేఖ : శా...రదా!

శార : ఆయనకు నేనే పంచప్రాణాలు!

శేఖ : నాకూ ఒకనాన్న వున్నాడు శారదా. అంతేకాదు నాకు ఒకఅమ్మకూడా వుంది. నేను లేకపోతే వాళ్ళు బ్రతకడం కష్టమే! నావాళ్ళందర్నీ వదిలి నేను వస్తున్నప్పుడు, నీవుమాత్రం అలా ఎందుకు చెయ్యలేవు? (A pause) బాగా ఆలోచించు శారదా. ఇది మనకు పరీక్షాసమయం. ప్రేమకూ, బాంధవ్యానికీ మధ్య సంఘర్షణ యిది. యిప్పుడు రెండింటిలో ఒకదాన్ని మనం వొదులుకోక తప్పదు.

శార : శేఖర్!

శేఖ : (ఆవేశంతో చెప్పుకపోతున్నాడు.) నేను ప్రేమ కోసం, నా సర్వస్వం త్యజించుతున్నాను. యిక నిర్ణయించుకోవలసింది నువ్వే. ఇప్పుడు నీ నిర్ణయం మీదనే మన బతుకులు ఆధారపడి వున్నయ్. (శాస్త్రగాడు) జీవితంలో నిజమయిన, త్యాగానికి అవకాశం ఒక్కసారే వొస్తుంది. ఇటు ప్రేమించిన ప్రియుడు—అటు కని పెంచిన తండ్రి—ఎవరినో ఒకరిని వదులుకోవా లిప్పుడు!

శార : భగవాన్! ఏమి టీ పరీక్ష! (కూలబడిపోయింది.)

శేఖ : (దగ్గరగా వెళ్ళాడు.) స్త్రీగాని, పురుషుడుగాని జీవితంలో ఎవరినో ఒకరినే పెళ్ళాడగలుగుతారు. ఎవరికో ఒకరికే హృదయము మర్పించగలుగుతారు.

ఆలోచించు. మన మేనాడో భార్యాభర్తల మయ్యాము. సంఘందృష్టిలో కాకున్నా, మన అంతరాత్మలకూ పరమాత్మకూ యీ సత్యం తెలుసు. దీన్ని కాదనే హక్కు మనకు లేదు.

శార : (తల తిరిగిపోతుంది) శేఖర్!

శేఖ : నీభర్త నీకు కావాలనుకుంటే వెంటనే ఈ యిల్లు వదిలి బయటకు రా.

శార : (బాధగా) శేఖర్!

శేఖ : ఏదో ఒకటి త్వరగా తేల్చుకో.... ఈ రాత్రే మన మీా ఊరు వొదిలి వెళ్ళాలి. [వెళుతున్నాడు]

శార : శేఖర్! (రెండడుగులు వేసింది)

శేఖ : మళ్ళీ వొస్తాను. (వెళుతూ ఆగి) అప్పుడు.... నువ్వు లేకుండా ఈ యింటినుండి వంటరిగా బయటకు వెళ్ళటంమాత్రం జరగదు.

[ చరచర బయటకు వెళ్ళిపోయాడు. శారద అలాగే నిలబడివుంది. శేఖర్ మాటలు ఆమె బుర్రలో తిరుగుతున్నయ్. ]

"ప్రేమకూ బాంధవ్యానికీ మధ్య సంఘర్షణ ఇది. యిప్పుడు రెండింటిలో ఒకదాన్ని వొదులుకోక తప్పదు."

శార : శేఖర్!

"ఇటు ప్రేమించిన ప్రియుడు—అటు కని పెంచిన

తండ్రి—యెవరినో ఒకరిని త్యాగంచెయ్యాలి నువ్వు"

శార : నాన్నా! [కుమిలిపోతుంది. అవేమాటలు ఆమె బుర్రలో తిరుగుతున్నయ్. బయటనుండి కేశవ రావు, జనార్ధనరావుగారలు వచ్చారు. వారి వెను కనే రామారావుకూడా]

కేశ : అమ్మా, శారదా!

శార : [ఉలిక్కిపడింది. పైటచెరగుతో కళ్ళుతుడుచు కుంది.]

కేశ : (దగ్గరగావొచ్చి) ఇదేమిటమ్మా! లైటన్నా వెలి గించకుండా చీకట్లో నిలబడ్డావ్?
[తనే వెళ్ళి లైట్‌స్విచ్ వేసి వచ్చాడు]

జనా : శారదా! [దగ్గరగావచ్చి, చేతిసంచిలో నుండి, పళ్లు, పూలు తీసి శారద కిచ్చాడు.]

శార : [అందుకుని డ్రాయరుపైన వుంచింది.]

కేశ : అలావున్నావేమ్మా? వంట్లో బాగుండలేదా?

శార : ఏమీలేదు నాన్నా. [లోనికెళ్ళిపోయింది మధ్య వాకిలినుండి]

జనా : మరి, నేను ఉదయాన్నే వెళతానోయి బావా!

కేశ : ఏం? అంత తొందరగా...

జనా : బలేవాడివే. ముహూర్తం పట్టుమని పదిరోజుల యినా లేదు. అన్నీ సర్దుకోవాలా? ఆనక అది సరి లేదు యిది సరిలేదు అని నన్ను సాధించటానికా?
[ఇద్దరూ నవ్వుకున్నారు]

కేశ : పద. కాస్సేపు మేడపైన కూర్చుందాం.

జనా : అలాగే. ఆఁ, రామం.... నువ్వు...

రామా: నేను ఇక్కడే వుంటాన్లే మావయ్యా. నాకొంచెం పనుంది.

జనా ; సరే. పదవోయి బావా.

[కేశవరావు, జనార్ధనరావులు పైకి వెళ్ళారు. రామారావు కుర్చీలో కూర్చుని ఆలోచిస్తున్నాడు. క్షణమాగి మధ్యవాకిలివరకూ వెళ్ళి, "శారదా! శారదా!" అని పిలిచాడు. శారద బయటకు వచ్చింది.]

రామా: [ఆమెముఖంలోనికి నిశితంగా చూస్తూ] అలా వున్నావేం?

శార : ఎలా వున్నాను.

రామా: మొహమంతా అదోవిధంగా వుంది. వంట్లో బావుండలేదా?

శార : లేదు

రామా: అంటే?

శార :........

రామా: [దగ్గరగా వెళ్ళి] ముహూర్తం పెట్టించాం. ఏదో తారీఖున వివాహం. [ఆగి ఆమె మొహంలోనికి చూశాడు.]

రామా: మనం రేపే బజారుకు వెళ్ళి నీకు కావల్సినవన్నీ కొందాం. సరేనా?

శార : [సరేనన్నట్లు తలూపింది]

రామూ: నాన్న హృదయం యిప్పు డెంత తేలికపడిందో తెలుసా? ఈ క్షణంకోసమే ఆయన తహతహ లాడా రిన్నాళ్లూ! సరే, నువ్వు త్వరగా భోజనాల ఏర్పాట్లవీ చూడు.

[మధ్యతలుపులు తీసుకుని వెళ్లిపోయాడు. శారద ప్రతిమలా నిలబడిపోయింది. దూరాన్నుండి రేడి యోలో పాట వినిపిస్తోంది.]

పా ట

ఇది పరీక్ష– నీ కిది పరీక్ష
నీ జీవితగమనానికి
నిజ మిది అగ్నిపరీక్ష
కంటికి రెప్పయి కాచిన
తండ్రిమనసే తల్లడిల్లె
హృదయమిచ్చి ప్రేమించిన
ప్రియునెదలో బడబాగ్నులు
కనిపెంచిన మమకారాలకు
మదిపెంచిన ప్రేమలతను
బలిసేయుదువో...
ప్రేమించిన ప్రియునికొరకు
సహారల మమతలనే
విడనాడుదువో
ఇది పరీక్ష....

[పాట పూర్తవుతుండగానే శారద నెమ్మదిగా వచ్చి సోఫాలో జారబడిపోయింది. క్షణం తర్వాత శేఖర్ బయటనుండి వచ్చాడు. వాకిలివద్ద నిలబడి సన్నగా 'శారదా' అనిపిలిచాడు.]

శార : (త్రుళ్ళిపడి) శేఖర్ ! (అంటూ దగ్గరగా వెళ్ళింది.) వెళ్ళిపో శేఖర్. అన్నయ్యావాళ్ళు ఇంట్లోనే వున్నారు. వెళ్ళిపో.

శేఖర్ : వెళ్తాను. రాత్రి 11 గంటలకు మన మీ ఊరు వదిలి వెళ్ళిపోవాలి. అన్ని ఏర్పాట్లు చేస్తున్నాను.

శార : శే....ఖర్ !

శేఖర్ : ప్రయాణానికి సిద్ధంగావుండు. [చరచర వెళ్ళిపోయాడు.]

శార : శేఖర్ ! (ముందుకు రెండడుగులువేసి ఆగిపోయింది.)

[అంతకుముందు వినిపించిన పాట ఆమె మనసులో మెదులుతూంది.]

పాట

కని పెంచిన మమకారాలకు
మది పెంచిన ప్రేమలతను
బలిసేయుదువో.... ....

ప్రేమించిన ప్రియునికొరకు
సోదరుల మమతలనే
విడనాడుదువో ..

ఇది పరీక్ష ... ... ...

[పాట ఐపోతుండగానే_]

శార : భగవాన్ ! నా మార్గమేది ? భగవాన్ !

[సోఫాలో కూలబడిపోయింది. రామారావు దుస్తులు మార్చుకుని, లోపలినుండి వస్తున్నాడు. నెమ్మదిగా 'శారదా' 'అంటూ అతను దగ్గరగా వచ్చేసరికి లైట్లు ఆరిపోయినయ్.]

—o—

# శారద

## మూడవ దృశ్యము

[అదేరాత్రి పదిగంటలకు. శారద ఒంటరిగా సోఫాలో కూర్చుని తీవ్రంగా ఆలోచిస్తోంది.

రామారావు ఒకనిముషం తర్వాత మేడపైనుండి వస్తున్నాడు.]

రామా:(శారదనుచూచి దగ్గరకు వచ్చాడు) శారదా !

శార !........ ...

రామా: శారదా !

శార : (తలెత్తి చూచింది.)

రామా: ఇంకా కూర్చునే వున్నావేం ?

శార : (లేచి నిలబడింది.)

రామా: ప్రొద్దుపోయింది. లైట్లార్పేసి, వెళ్ళి నిద్రపో.

శార : వెళ్తాను. (రెండడుగులు వేసింది.)

రామా; (మధ్యవాకిలివేపు నడిచాడు. లోనికి వెళ్ళబోతూ ఆగి-) శారదా!

శార: (దగ్గరగా వెళ్ళింది.)

రామా: అనవసరంగా ఆలోచించి మనసు చెడగొట్టుకోకు. (కొంచెం ఆగి) నాన్న హృదయంలో ఒకతుపాను

తర్వాత ప్రశాంతత నెలకొంటూంది. ఆ వాతా
వరణాన్ని తిరిగి కలుషితంచెయ్యబోకు, ఏం ?

శార : ......... (మాట్లాడలేదు. అతను చెప్పిందంతా
శిలాప్రతిమలా నిలబడి విన్నది.)

రామా: ఇక పడుకో, చాలా ప్రొద్దుపోయింది.

[మధ్యవాకిలినుండి లోనికి వెళ్ళిపోయాడు. శారద
అలానే నిలబడి ఆలోచిస్తోంది. ఆమెలో సంఘ
ర్షణ ఎక్కువయింది. అన్న, శేఖర్, తండ్రీ
ఆమె బుర్రలో తిరుగుతున్నారు.]

శేఖర్ గొంతు :- "నీ ప్రేమకోసం నా సర్వస్వం త్యజిం
చాను శారదా! ఇప్పుడు నువ్వుతప్ప ఈ ప్రపం
చంలో నా కెవ్వరూ లేరు."

"జీవితంలో నిజమైన త్యాగానికి అవకాశం ఒక్క
సారే వస్తుంది. అప్పుడే జీవితం మరోమలుపు తిరు
గుతుంది."

"ఇటు ప్రేమించిన ప్రియుడు - అటు కని పెంచిన
తండ్రి_ఎవరినో ఒకరిని త్యాగంచెయ్యాలి ను
వ్విప్పుడు."

శార : శేఖర్ ! (మొహం చేతుల్లో కప్పుకుంది.)

రామారావుగొంతు :-

"నీ మనసేం కోరుతుందో తెలుసుకునేశక్తి నీకు
లేదు శారదా! సర్వం నీ తండ్రేనని భావించు.
నీ భవిష్యత్తును ఆయనచేతుల్లో వుంచి నిశ్చింతంగా
వుండు."

శార : నాన్నా !

కేశవరావుగొంతు :-

"నీ బాగోగులు నాకన్నా విచారించేవాళ్ళెవరమ్మా ఈ ప్రపంచంలో ? నీకు మంచి జరగనిపని నీతండ్రి ఏనాడూ చెయ్యడు !"

శార : నాన్నా ! (రివ్వున వెళ్ళి సోఫాలో కూలబడింది.)

శేఖర్ గొంతు :-

"స్త్రీగాని, పురుషుడుగాని ఎవరినో ఒకరినే ప్రేమించగలుగుతారు. ఒకరినే పెళ్ళాడగలుగుతారు. మనం ఏనాడో భార్యాభర్తలమయ్యాం. నీభర్త కావాలనుకుంటే వెంటనే ఈ ఇల్లువదిలి రా."

శార : (భయంగా శేఖర్ !

శేఖర్ గొంతు :-

"ఏదోఒకటి తేల్చుకో. ఏదోఒకటి తేల్చుకో. మనం ఈ రాత్రే ఊరువదిలి వెళ్ళిపోవాలి."

[ఆమెబుర్ర తిరిగిపోతోంది. కళ్ళవెంట అశ్రుధారలు ప్రవహిస్తున్నాయ్. బయటనుండి కారుహారన్ రెండుసార్లు వినిపించింది. అమె వీధివాకిలివరకూ వెళ్ళి చూచింది. భయంగా లోనికి తిరిగి వచ్చేసింది. తిరిగి హారన్.

తల చేతులమధ్య ఇరికించుకుని, గట్టిగా కళ్ళు మూసుకుంది.

తిరిగి హారన్. ఆ తర్వాత నెమ్మదిగా శేఖర్ వచ్చాడు.]

శేఖర్ ; శారదా ! (నెమ్మదిగా పిలిచాడు.)

శార : (భయంగా దగ్గరకు వెళ్ళింది.) శే... ఖర్ ! నువ్వు నువ్వు ... (వణికిపోతోంది.)

శేఖ : బయట టాక్సీ సిద్ధంగావుంది. రా త్వరగా. (చెయ్యి పట్టుకున్నాడు.]

శార : శేఖర్ ! వద్దు. తొందరపడటం మంచిదికాదు.

శేఖ ; నీకు తెలియదు శారదా ! ఈరాత్రి గడిస్తే మన జీవితాలు ధ్వంసంకాకతప్పదు. అందుకే అంతా సిద్ధంచేసుకుని వచ్చాను. తెల్లవారేసరికి, ఎవ్వరూ అందుకోలేనంతదూరం వెళ్ళిపోదాం. రా శారదా! (చెయ్యిపట్టుకుని లాగాడు.)

శార ; (విదిలించుకోవటానికి ప్రయత్నిస్తూ.) శేఖర్ ! నాన్న ! మా నాన్న.

శేఖ : నాన్న నాకుమాత్రం లేడా శారదా ? నా మాట విను. కొన్నాళ్ళపాటు అందరికీ దూరంగా వున్నామంటే, అంతా సవ్యమయిన మార్గాని కొస్తారు. నడువు త్వరగా.

శార : శేఖ....

శేఖ : రా శారదా ! (లాక్కుపోతున్నాడు. శారద పెనుగులాడుతోంది. అలానే యిద్దరూ వీధివాకిలి వరకూ వెళ్ళారు. గభీమని మధ్యవాకిలి తెరుచుకుని రామారావువచ్చాడు)

రామా: (పిడుగులా) ఆగు!

[ఇద్దరూ ఆగిపోయ్యారు. అతన్నిచూడగనే శేఖర్

కొయ్యబారిపొయ్యారు. రామారావు గంభీరంగా అడుగులేస్తూ వాళ్ళవద్దకు వచ్చాడు. శారదకు ప్రాణాలెగిరిపోయినట్లయింది.)

రామా: (శేఖర్‌ను తీవ్రంగా చూస్తూ) ఎవరు నువ్వు?

శేఖ : ... ...

రామా: మాట్లాడవేం ?

శార : (భయంగా) అన్నయ్యా ! (దగ్గరగా వెళ్ళబో యింది.)

రామా: నోర్ముయ్. నడువు లోపలికి. (శారదను లాగి చెంపమీద కొట్టాడు.)

శార : (గజగజలాడిపోతోంది.)

రామా: వెళ్ళవేం? (తిరిగి కొట్టాడు.)

శార : (ఏడుస్తూ లోనికి వెళ్ళిపోయింది.]

రామా: (శేఖర్ దగ్గరకొచ్చి) ఎవరు నువ్వు ?

శేఖ ; నా పేరు శేఖర్.

రామా: ఏమి టిదంతా ?

శేఖ : (తడబడుతున్నాడు.)

రామా: నిన్నే అడుగుతోంది ? (గద్దించాడు.)

శేఖ : (ధైర్యం తెచ్చుకుంటూ] నేను——శారదను ప్రేమించాను.

రామా: ఎవర్నడిగి ప్రేమించావ్ ?

శేఖ : ... ... ...

రామా: చెప్పవేం ?

శేఖ : ప్రేమించటానికి ఒకళ్ళ నడగటమేమిటి? అది నా స్వంతనిర్ణయం.

రామా: అదే. నిన్ను నువ్వయినా, అడిగావా అని? ఇడియట్! ఇదేం జీవితమనుకున్నావా? నాటకమనుకున్నావా! ఆ పిల్ల బతుకేం కావాలనుకున్నావు?

శేఖ : బాగుచెయ్యాలనుకున్నాను.

రామా: షటప్ రోంగ్. బాగుచెయ్యాలనుకున్నాట్ట! అమాయికురాలయిన పిల్లకు మాయమాటలు చెప్పి, మనసువిరిచి, అర్ధరాత్రి ఇంటినుండి లాక్కుపోవటమా బాగుచేయటం?

శేఖ : ఆ పరిస్థితిని మీరే కల్పించారు.

రామా: నోర్మూయ్. (పళ్ళునూరాడు.)

శేఖ : దేనికి? మేమిద్దరం మనసారా ప్రేమించుకున్నాం. పెళ్ళాడాలని నిశ్చయించుకున్నాం. పెద్దలమనే పేరుతో అటు మా నాన్నా, ఇటు మీరూ, మా మార్గంలో అడ్డుగోడలు కట్టారు. మా నోళ్ళు నొక్కి, మా స్వేచ్ఛ నరికట్టి, మమ్మల్ని బందీలను చేసి,మా కిష్టంలేని మార్గంలోకి మమ్మల్ని మళ్లించాలని చూశారు. గత్యంతరంలేక, మా బతుకులు మంటగలుపుకోలేక మీఅందరికీ దూరంగా వెళ్ళిపోయి.... ....

రామా: ఆపు. ప్రేమించటానికి పెళ్ళాడటానికి సీ అర్హత ఏమిటో ఆలోచించావా?

శేఖ : నా అర్హతకు తక్కువేమీ లేదు. అన్నిహంగులు

వున్నయ్ నాకు. చదువు, సంస్కారం, ఆస్తిపా
స్తులు, కులగోత్రాలు-అన్నింటికి మించి. నిష్కల్మ
షమైన హృదయం వుంది. పరిస్థితుల్ని ఎదిరించి
పోరాడగల ధైర్యమూ వుంది.

రామా: అంత ధైర్యమున్నవాడివి అర్ధరాత్రప్పుడు పారిపో
వడమెందుకు? ఇక్కడే నిలబడి పోరాడలేక
పోయ్యావ్?

శేఖ : పరిస్థితులు చెయ్యిదాటిపోబట్టే ...

రామా: ఓహో! రేపు ఆ పిల్ల భారమని తోచినప్పుడు
కూడా పరిస్థితులు చెయిజారిపోయినయ్ అంటూ
ఆ మెఖర్మ కామె నొదిలి యిలాగే పారిపోవని
గ్యారంటీ ఏమిటి?

[శేఖర్ ఏదో అనబోయాడు. రామారావు అతన్ని
మాట్లాడనివ్వకండానే అందుకున్నాడు. అదే సమ
యంలో జనార్ధనరావు మేడదిగి వొచ్చాడు. జనా
ర్ధనరావు దూరంగా, మెట్లదగ్గరే నిలబడిపోయాడు.)

రామా: మిష్టర్ శేఖర్! నీ కింకా ప్రపంచమంటే ఏమిటో
తెలియదు బాధ్యతలు తెలియని వయస్సు నీది.
బాధ్యతారహితంగా బ్రతుకుతున్న నువ్వు ఈ
వయసులో మరొకవ్యక్తి బాధ్యతను పైనవేసు
కోవటం కష్టం. ఇప్పుడు ఆవేశంలో నువ్వు చేయ
బోయినపని జరిగేవుంటే, నీ బ్రతుకు నాశనంచేసు
కోవటం, మరో అమాయకురాలి జీవితం నాశనం
చెయ్యటమేగాక, రెండుకుటుంబాల భవిష్యత్తును,

పరువు ప్రతిష్ఠలను మంటగలిపివుండేవాడివి! ఈ నేరానికి నిన్ను- నేను తలుచుకుంటే కటకటాల వెనక్కి పంపగలను. కాని.... నిన్ను చూచి జాలి పడి క్షమిస్తున్నాను. బుద్ధిగా ఇంటికి వెళ్ళు. (కాస్తాగి) నీకు సరైనమార్గాన్ని నిర్ణయించవల సింది, నీ కీ రూపాన్నిచ్చిన తల్లిదండ్రులే. వాళ్లు చెప్పినట్లు నడుచుకో. మళ్ళీ యిలాంటి పిచ్చి పనులు తలపెట్టకు.

(వీధిలోనుండి శేఖర్ తండ్రి కుటుంబరావువచ్చాడు. ఆయన కొంచెం బొద్దుగా, పొట్టిగా వున్నాడు. మెలిదిరిగిన మీసం. మనిషీ మాటాకూడా కొంచెం మొరటు. చేతిలో వంకెకర్ర వుంది.)

కుటుం: [వస్తూనే] ఆమాట కొంచెం నీ చెల్లెలికూడా చెబితే బాగుంటుందిగా.

రామా: [ఆశ్చర్యంగా ఆయనవంక చూశాడు.]

శేఖ : [తండ్రిని చూడగనే తలదించేశాడు.]

జనా : [ముందుకు వచ్చాడు.]

కుటుం: గంటనుంచీ వాకిట్లోనిలబడి వింటున్నా వ్యవహార మంతా. మాట తియ్యగా మాట మావాడ్నే అంటు న్నావుగాని, నీ చెల్లెల్ని ఒక్కమాటయినా అన్న పాపానపోలేదే! ఇదేనా పెద్దమనిషి తరహా?

రామా; మీరు ....

కుటుం; ఈ దవటకి బాబున్లే. మీ పిల్లమాత్రం తక్కువ తిన్నదా అని! సీతాకోకచిలుకల్లే సింగారించుకుని

పొద్దస్తమానం మా కొంపచుట్టూ తిరుగుతుంటే, మగాడు వాడుమాత్రం ఏంచేస్తాడు?

రామా: మీరు కొంచెం మర్యాదయిన భాష వాడటం నేర్చుకోవాలి.

కుటుం: దానికి నీదగ్గర పాఠాలు చెప్పించుకుంటాన్లే. ఇప్పుడిక జరగాల్సిందేమిటి? ఫలానావాడి కొడుకిలాంటి పాడుపని చేశాడంటే, నలుగురిలో నా తల తెగిపోకుండా వుంటదా అని?

జనా: [అతనిధోరణికి చిరాకుపడి దగ్గరగా వచ్చాడు.] మీమాత్రం పరువుప్రతిష్ఠలు అందరికీ వున్నాయిగాని, కొంచెం నోరుతగ్గించండి బాబూ! మిగిలిన కాస్త పరువయినా దక్కుతుంది.

కుటుం: నానోరుమూస్తేమాత్రం, లోకంనోరెట్లామూస్తావు? ఇంత జరిగాక ఇది వీధినపడకుండా ఎలా దాస్తావు? కుండ మియ్యి మూకుడుంటదిగాని, లోకంనోరు మియ్యటాని కేముంటుంది?

జనా: మీ ధోరణి చూస్తే మీరే బజారుకెక్కేలా వున్నారు. మీకేం మీవాడు మగవాడు! కాని-

కుటుం: మగేంవిటి ఆడేంవిటి? పరువుపోవటాని కేదయినా ఒకటే.

జనా: అందుకే కొంచెం నిదానంగా మాట్లాడమంటున్నాను [కేశవరావుగారు ఈ గందరగోళానికి పైనుండి దిగివచ్చారు. అందర్నీచూచి కొన్ని

క్షణాలపాటలానే నిలబడిపోయాడు. తర్వాత ముందుకు వచ్చాడు.]

కేశ : రామం, ఏమిట్రా యిదంతా?

రామా: మాట్లాడకుండా తలవంచుకుని దూరంగా వెళ్ళాడు]

కేశ : ఏంరా! ఏమిటీ గొడవ? ఎవరు వీళ్ళంతా?

కుటుం: ఏముంది బాబూ! నీకూతురు నాకొడుకూ కలిసి చేసిన నిర్వాకం. మీ పరువు నా పరువు కృష్ణలో కలిసే రోజొచ్చిందిలే, రండి.

కేశ : [అర్థంకాక] ఏమిటి! మీరు చెప్పేది...

కుటుం: అర్థంకాలా బాబూ! మీ పిల్ల, మా పిల్లాడూ కలసి, మీ తలా నా తలా నేలగొట్టి ఉడాయించబోతున్నారు. తెలిసిందా?

కేశ : [నెత్తిన పిడుగుపడ్డట్టయింది.] శారదా! [కూలబడిపోయాడు]

[క్షణకాలం పూర్తి నిశ్శబ్దం]

కుటుం; [శేఖర్ ని చూస్తూ] ఏంరా! ఇన్ని గుండె లెక్కడనుంచి వచ్చినయ్ రా? అవతల లగ్నాలు పెట్టుకుని బ్రహ్మాండంగా పనులు జరుపుతుంటే, ను విట్లా వుడాయించితే, నా పరువేంగావాలీ అని?

జనా: [దగ్గరగా వచ్చి] బాబూ! జరిగిందేదో జరిగింది. అల్లరి దేనికి? కుర్రవాడ్ని యింటికి తీసుకెళ్ళండి గుట్టుగా.

కుటుం: తీసుకెళ్ళక ఊరుకుంటానా! కదల్రా.

కేశ: [అలానే కూర్చుని "జనార్ధనం" అని పావురుమ న్నాడు.]

జనా : [దగ్గరగా వెళ్ళి] ఛ! ఊరుకో బావా. ఏమిటిది చిన్నపిల్లాడిలా!

కేశ: చిన్నపిల్లాడినయినా బాగుండేదిరా ఈ క్షణంలో. శారదా! (ఏడ్చాడు.]

జనా; బావా! [ఓదార్చుతున్నాడు.]

కుటుం: పిల్లల్ని కనంగానే సరిపోదు బాబూ! కాస్తంత పెంచేవిధానంకూడా తెలిసుండాలి. ఆడపిల్ల హద్దు దాటిందంటే అంతకన్నా అవమానం ఏమయినా వుందా! [నిరసనగా] ఎందుకు చదువుకున్నారు పైగా! ఒక్కపిల్లను పెంచుకోవటం తెలవకపోయె!

రామా : [తీవ్రంగా] కుటుంబరావుగారూ!

కుటుం: అబద్ధమేముంది? ఆ పిల్లను కాస్త హద్దుల్లో పెడితే ఇలాంటి తలవొంపులమాలినపని జరిగేదా? గాలి పటాన్ని అట్లాగే వొదిలేస్తే, ఎక్కడో ఒకచోట దారం పుటుక్కుమని తెగిపోదూ?

రామా: (తలవంచుకొని ఎడంగా వెళ్ళిపోయాడు.)

కుటుం: ఇదే నా పిల్లయితేనా.... [పళ్ళునూరాడు.]

కేశ : (కుమిలిపోతున్నాడు.]

జనా: బావా: లోనికెళదాం పద. [చెయ్యిపట్టుకుని లేవ నెత్తాడు. కుటుంబరావుతో] ఇక మీరు వెళ్ళండి బాబూ. రా బావా. (కేశవరావును నడిపించుకుని మధ్యవాకిలిగుండా వెళ్ళిపోయాడు.]

రామా: [తల చేతులమధ్య ఇరికించుకుని, కుర్చీలో కూల బడ్డాడు.]

కుటుం: ఇకనన్నా పిల్లను కొంచెం జాగ్రత్తగా చూచు కోండి. [శేఖర్‌తో] కదలవేంరా? ఇంకా నిలబడ్డా వెందుకు? చేసిన నిర్వాకం చాలకనా!

[దగ్గరగా వెళ్ళాడు.)

శేఖ: ఇక నే నా ఇంట్లో అడుగుపెట్టను.

కుటుం: ఆహా! సర్లే. ఆ ఇల్లుగాకపోతే, మూడంతస్థుల మహలు కట్టించుకుందువుగాన్లే! పోసుకోలువేషా లెయ్యక నడువు ముందు. (జబ్బపట్టుకున్నాడు.)

శేఖ : మీకూ మాకూ ఏమీ సంబంధంలేదిక.

[విదిలించుకున్నాడు.]

కుటుం: నువ్వు లేదంటే చెల్లొద్దుటగాని, నడువు.

[తిరిగి చెయ్యిపట్టుకున్నాడు. శేఖర్ విదిలించుకు న్నాడు.]

కుటుం: ఎవరికన్నా చెప్పు పెద్దమనుషులికి. ఇదేమయినా మంచిపనేనంటారేమో. కని పెంచి యింతోడిన్ని చేసిన మాకంటే, నీకు ఎక్కువ తెలుసా అని? అవ తల సమ్మంధం కాయంచేసుకుని కూర్చుంటే, నువ్వీపనిచేయటం సబబుగావుందా? ఇనప్పెట్టి పగలగొట్టి పదివేలు తేగానే మొనగాడివయ్యాననుకుంటున్నావు గాఁవాలు.

(రామారావు ఆశ్చర్యంగా శేఖర్‌ను చూశాడు.)

కుటుం; లండనుకు పోయినా నిన్ను లాక్కురాకుండా వద ల్తాననుకుంటున్నావా? ఈ కుటుంబరావం టే ఏంటో తెలవ దింకా!

(మీసం మెలి పెట్టాడు)

శేఖ: (సూట్ కేసుతం డిముందుపడ వేసి) ఇదుగో మీడబ్బు.

కుటుం: (అందుకుని) డబ్బిస్తే నిన్ను వదల్తా ననుకుంటు న్నావా! నడువు ఇంటికి. (చెయ్యిపట్టుకున్నాడు.)

శేఖ: నేను చచ్చినాసరే రాను. (విదిలించుకుంటున్నాడు.)

కుటుం: ఇంతలావు బాబు నుండి నిన్ను చావనిస్తానటగాని, వెధవ్వేషా లెయ్యక నడువ్ ముందు.

శేఖ ; మీరుచెప్పినట్లువింటానని కల్లోకూడా అనుకోకండి.

కుటుం; అదంతా మనఇంటిదగ్గరగదూ తేల్చుకోవాల్సింది! నామాటనువ్వినేదీ, నీమాట నేవినేదీను. (గుంజాడు)

శేఖ; [విదిలించుకుని) నాన్నా!

కుటుం; ఏం మాలావు ఇదిబోతున్నావ్? (లాగి చెంపమీద కొట్టాడు.)

రామా: [ఇంతసేపు వాళ్ళగొడవకు చిరాకుపడుతున్నాడు. ఇక సహించలేక లేచి ముందుకు వచ్చాడు.]

ఫూల్స్! ఇదేం ఇల్లనుకున్నారా? బజారనుకు న్నారా? గెటవుట్.

కుటుం: ఇప్పుడా రెండింటికి తేడా పోతోంది లే.

రామా; వెళ్ళండి ముం దిక్కడున్నండి. [గర్జించాడు.]

కుటుం: కదల వేంరా, సిగ్గు లేదూ సీకు!

శేఖ; నన్ను కోసినాసరే ఆ ఇంట్లో అడుగుపెట్ట నిక.

కుటుం: సరేలే అదీ చూస్తాను. ఆ ఇల్లుగాక ఏ ఇంటికి పోతావో అదీ చూస్తాను. ఆళ్ళలాంటివాడు ఈళ్ళ లాంటివాడు అనుకుంటున్నావేమో నీ బాబు! మర్యాదగా వచ్చావా సరే, లేదా... ఆనక చూస్తావుగా మన తడాఖా!

[మీసం మెలిపెట్టి సూటుకేసు తీసుకుని వెళ్ళి పోయాడు.]

శేఖ: [అలాగే నిలబడివున్నాడు]

రామా: [తీవ్రంగా చూస్తూ] వెళ్ళవేం? ఇంకా నిలబడ్డావెందుకు?

శేఖ: రామారావుగారూ! నన్ను...

రామా: (అసహ్యంగా) వెళ్ళు. (బయటకు చెయ్యి చూపించాడు.)

శేఖ: నేను చెప్పేది కాస్త వినండి.

రామా: అక్కర్లేదు.

శేఖ: అన్నీ తెలిసిన మీరుకూడా ఉద్రేకపడితే ఎలా? నేను చెప్పేది సావధానంగా విని...

రామా: ఏమీ చెప్పనక్కరలేదు.

శేఖ: అలాఅంటే ఎలా? నామాట విని ఆ తర్వాత...

రామా: మా కుటుంబపు పరువుప్రతిష్ఠలన్నీ గంగలో కలిపావుగా. ఇంకా కసితీరలేదా? ఏంచెయ్యాలని చూస్తున్నా వింకా. వెళ్ళు ముందు. (వెళ్ళి సోఫాలో కూలబడ్డాడు.)

శేఖ : (అతని దగ్గరగా వెళ్ళి చెబుతున్నాడు.) మీరు నన్నర్థంచేసుకోవలసిందిగా ప్రార్థిస్తున్నాను. నేను శారదను త్రికరణశుద్ధిగా ప్రేమిస్తున్నాను. ఎట్టి అవాంతరాలువొచ్చినా, మీరు సరేనంటే చాలు... ఆమెను పెళ్ళాడటానికి వెనుకాడను.

రామా: ఎన్ని అవాంతరాలనైనా ఎదుర్కోగలవాడివి, నీ తండ్రిముందు పిల్లికూనలా అయిపోయావేం! మిష్టర్ శేఖర్! ఇది జీవితానికి సంబంధించిన వ్యవహారం. బొమ్మలాటగాదు. కుర్రతనపుచేష్టలు మాని ఇంటికి వెళ్ళు.

శేఖ : అలా అనకండి. మీ కాళ్ళు పట్టుకుని ప్రార్థిస్తున్నాను. నన్ను శారదను వేరుచెయ్యకండి.

రామా: నీ తల్లిదండ్రుల అంగీకారంపొంది ఆ తర్వాత నాతో మాట్లాడు. [జనార్థనరావు వచ్చి ఎడంగా నిలబడ్డాడు వింటూ.]

శేఖ : మా తండ్రి ఇష్టపడకపోయినా మీరు అంగీకరిస్తే చాలు. మా వివాహం జరుగుతుంది. నేను పసివాడ్నికాదు. స్వయంగా ఆలోచించి నిర్ణయం చేసుకోగల శక్తి వుంది నాకు.

రామా: ఆ శక్తే వున్నవాడివయితే యిలా పిచ్చితనంగా ప్రవర్తించవు. ఇనప్పెట్టె పగలగొట్టి డబ్బు తేవటం? అర్థరాత్రి ఆడపిల్లతో పారిపోవటానికి ప్రయత్నించటం—ఇవన్నీ.... సరే, అదంతా అనవసరం. ముందు నువ్వు యిక్కడ్నించి వెళ్ళిపో.

శేఖ : అదే మీ ఆఖరిమాటా?

రామా: ఆఁ.

శేఖ : బాగాఆలోచించండి. శారదకూనాకూ మధ్య మీ రూహించినదానికన్నా ఎక్కువ సంబంధమేవుంది. మమ్మల్ని వేరుచెయ్యటం మీ రనుకున్నంత తేలికగాదు.

రామా: (తీవ్రంగా) శేఖర్!

శేఖ : నేను బెదిరించటంలేదు రామారావుగారూ! మా యిద్దరిదీ పవిత్రమైన ప్రేమ. ఆ ప్రేమకు చిహ్నం శారదలో పెరుగుతోంది. ఈవిషయం మీరు విస్మరించగలిగినంత తేలికకాదు, శెలవు.

(చరచర వెళ్ళిపోయాడు.)

రామా: ఆఁ! (నోరు తెరచి నిలబడిపోయాడు)

జనా : (నిట్టూర్చాడు. కాస్తాగి రామారావు దగ్గరగా వచ్చి) రామం!

రామా: [తేరుకుని] మాఁవయ్యా.... ...యెంత పాడురోజు మాఁవయ్యా ఈరోజు! [దుఃఖం పొర్లుకొస్తోంది.]

జనా : మంచిచెడ్డల సమ్మేళనమే జీవితం రామం. జరిగిందంతా మర్చిపోవటానికి ప్రయత్నించు. యిలా కూర్చో.

[తీసుకెళ్ళి కూర్చోబెట్టాడు. తనూఎదురుగా కూర్చున్నాడు. కాస్సేపు ఇద్దరూ మౌనంగా గడిపారు.]

జనా : రామం!

రామా: ఊఁ.

జనా : ఏంచేద్దామంటూ విప్ప్రుడు?

రామా: ఏముంది చెయ్యటానికి?

జనా : ఏదోఒకటి ఆలోచించాలిగా?

రామా: ........

జనా : నేనొకటి చెబుతాను వింటావా?

రామా: ఏమిటది?

జనా : అదే.... శారదవిషయంలో.

రామా; ఏమిటి? చెప్పండి.

జనా : [గొంతుసవరించుకుని] ఏదోవిధంగా శారదను ఆ కుర్రవాడికిచ్చి ముడిపెట్టడమే మంచిదని నా అభిప్రాయం.

రామా: మా.... మయ్యా!

జనా : అది చాలా మంచిపని రామం. ఆలోచించు. [లేచి నిలబడ్డాడు. ఒకప్రక్కగా తిరిగి మాట్లాడుతున్నాడు.]

శారద నా కడుపునపుట్టిన బిడ్డతో సమానం. ఆ పిల్ల ఏదైనా పొరపాటుచేస్తే, మీలాగే నేనూ కడుపులో దాచుకోగలను. ఆమె ఎంత పెద్ద అపరాధం చేసినా భరించి, శారదను నా యింటి కోడలుగా చేసుకోవటానికి వెనుకాడను. కాని... యిప్పుడు పరిస్థితులు వేరుగావున్నాయి. శారద మనసుకూడా ఆ కుర్రవాడిమీదే ఉందని వప్పుకోకతప్పదు. ఇష్టంలేనిపెళ్ళి చేస్తే మేలు జరక్కపోగా కీడు జరగటానికే యెక్కువ అవకాశముం

టుంది. అనుకూలంలేని దాంపత్యం సంసారానికి నరకంకన్న ఘోరంగా మారుస్తుంది. నా మాట విను. ఏదెలావున్నా శారద క్షేమంగా వుండటమే మనకు కావలసింది. ఏమంటావు?

రామా: కాని...

జనా: ఎలాగో ఒకలా ఆ కుర్రవాడితండ్రినికూడా వప్పించి, శారదను శేఖర్‌కిచ్చి పెళ్ళిచెయ్యటమే మంచిది.

రామా: [ఆలోచిస్తున్నాడు]

జనా: ఏమంటావు రామం?

రామా: మీ మాట కాదన్నమాటయ్యా. కాని... అది జరగని పని.

జనా: ఏం? ఎందుకు జరగదంటావ్?

రామా: ఆ కుటుంబరావు వట్టి మొరటుమనిషి. చూశావుగా ఆ ధోరణి.

జనా: అత నెలాంటివాడైతే మనకేం? పిల్ల పిల్లవాడు సుఖంగావుంటే...

రామా: ఆ కుటుంబరావు యీ పెళ్ళికి వప్పుకోడనే నే ననేది.

జనా: అదంతా నేను చూస్తానుగా; నీకెందుకు. నువ్వు సరేనను.

రామా: మీయిష్టం.

జనా: సరే. బావతో కూడా ఒకమాట చెప్పి వెడతాను. నువ్వు వెళ్ళి విశ్రాంతితీసుకో.

రామా: ఈ రాత్రిపూటా!

జనా: అవును. ఇప్పుడే వెళ్ళటం అన్నివిధాల మంచిది. ఈగొడవ బజారుకెక్కకముందే అన్నీ పూర్తిచేసుకోవాలి.

రామా: [సాలోచనగా] సరే.

జనా: [మధ్యవాకిలినుండి లోనికి వెళ్ళాడు.]

(రామారావు అలానే ఆలోచిస్తూ కూర్చునివున్నాడు. బయట సన్నగా గాలివోత ప్రారంభమయింది.

లోపలనుండి శారద కుమిలిపోవటం వినిపిస్తోంది. జనార్ధనంగారు ఆమెను ఓదార్చుతున్నాడు.)

జనా: (లోపలే) శారదా! ఊరుకోమ్మా. విచారించకు. నేనున్నానుగా! నీకేం భయంలేదు. అన్నీ బాగవుతయ్. నువ్వు నిర్విచారంగావుండు. కళ్లు తుడుచుకో.

రామా: (కలవరంతో అటూయిటూ తిరుగుతున్నాడు)

జనా: (లోపలనుండే) చూడు శారదా! యే విషయం గురించీ ఎక్కువగా ఆలోచించటం పనికిరాదమ్మా. ఆలోచించినకొలదీ సమస్య భయంకరరూపం దాల్చి మనముందు నిలబడుతుంది. నేను వెళుతున్నానుగా, నువ్వు నిశ్చింతగా నిద్రపో. అంతా మంచే జరుగుతుంది. (బయటకు వచ్చేశాడు.)

జనా: [మెట్లవద్దనున్న చెప్పులు తొడుక్కుంటూ] రామం!

రామా: ఆఁ.

జనా : నేను వెళ్ళొస్తాను. బావ గదిలో పడుకున్నాడు. అయినా ఈస్థితిలో ఆయనేమీ మాట్లాడలేడు లే. (రెండడుగులు వేసి ఆగాడు) రామం!

రామా: మాఁవయ్యా! (దగ్గరగా వొచ్చాడు.)

జనా : ఉద్రేకపడి, పిల్లనేమీ అనకు. యిప్పుడదున్న స్థితిలో మనసు చివుక్కుమన్నదంటే, యేదైనా అఘాయిత్యం తల పెట్టినా తలపెట్టవొచ్చు. జాగ్రత్త!

రామా: పోనివ్వండి. ఒక్కసారే ఏడ్చి వూరుకుటాం.

జనా : సర్లే సంతోషించాం. పొరపాటు జరిగిందికదా అని మనిషిని పోగొట్టుకుంటామా? సరే, నేను వెళుతున్నాను. నువ్వూ కాసేపు విశ్రాంతితీసుకో. (వెళ్ళాడు)

రామా: (అలానే తిరుగుతున్నాడు)

శార : (నెమ్మదిగా తలుపుతీసుకుని వొచ్చింది. రెండడుగులు ముందుకు వేసి అన్నను చూడగానే ఆగిపోయింది.)

రామా: (చూచాడు) ఆ గదిలోనే ఉరిపోసుకు చావక పోయ్యావ్? సిగ్గులేక మళ్ళీ బయటకొచ్చావెందుకు?

శార : (కుమిలిపోతుంది)

[రామారావు చరచర మేడపైకి వెళ్ళిపోయాడు.]

[శారద కుమిలిపోతూ మధ్య వాకిలికి దగ్గరలో నిలబడిపోయింది. కాస్తాగి కేశవరావుగారు సన్నగా దగ్గు

కుంటూ లోపలనుండి వచ్చారు. శారద ఆయన రావటం గమనించలేదు.

కేశవరావుగారు శారదకు దగ్గరగావచ్చి ఆమెవైపు జాలిగా చూశారు. పలకరించాలని గొంతుసవరించుకున్నారు. కాని మాట పెగల్లేదు.

శారదకూడా తండ్రినిచూచి ఏదో చెప్పబోవాలనుకుంది. కాని, ఆమెస్థితీ అలానే అయింది.

ఇద్దరూ ఒకరొకరు చూచుకుంటూ కొన్నిక్షణాలు గడిపారు. ఇద్దరికన్నులు అశ్రుపూరితాలయినవ్. చివరకు కేశవరావుగారే అతికష్టంమీద, 'అమ్మా శారదా!' అనగలిగారు.

శారదకు దుఃఖం పెల్లుబుకింది. "నాన్నా!" అని ఏడుస్తూ అయన్ను కౌగలించుకుంది.

ఆయన దుఃఖిస్తూనే ఆమెను ఓదార్చటానికి ప్రయత్నిస్తున్నారు.]

కేశ : అమ్మా! ఊరుకో...

శార : నాన్నా! (బావురుమంది)

కేశ : ఊరుకో తల్లీ! విచారించకు. [దగ్గరకు తీసుకున్నాడు. రెండుక్షణా లలానే గడిపారు.]

కేశ : యెంతపనిచేశావు తల్లీ! నీకు నే నేం అపకారం చేశాను చెప్పు?

శార : [తుళ్ళిపడింది] నాన్నా! [ఏడంగా జరిగింది]

కేశ : నా ప్రాణంకన్నా మిన్నగా నిన్ను పెంచుకుంటున్నానే! నన్నిలా చిత్రహింసచెయ్యడం నీకు

న్యాయమేనా తల్లీ!

శార : నాన్నా! [బావురుమంది]

కేశ : (ఆవేదన పడుతున్నాడు) నువ్వు ఆడింది ఆటగా పాడింది పాటగా జరుపుతున్నానే! నన్నెందు కిలా క్షోభపెట్టటం శారదా! తరతరాలనుండి ఏ వంశ ప్రతిష్ఠను చూచుకుని గర్విస్తూన్నానో, దాన్ని మంటగలపావుగా తల్లీ! [దగ్గు]

శార : (కుమిలిపోతుంది)

కేశ : (తమాయించుకుంటూ) ఏ పూర్వజన్మ శత్రుత్వమో ఇలా కక్ష సాధిస్తున్నావు శారదా!

(దగ్గుకుంటూ మేడపైకి వెళ్ళబోతున్నాడు. శారద ఆయన్ననుసరించి రెండడుగులు వేసింది. ఆయన ఆగిపోయాడు. తిరిగి వెనక్కి వచ్చి, భార్యఫొటో కెదురుగా నిలబడి, కళ్లవెంట అశ్రువులు రాలుస్తూ—)

కేశ : చూశావా లక్ష్మీ! నీ చిట్టితల్లి ఎంతపనిచేసిందో! నువ్వే బ్రతికివుంటే...ఇలా జరిగివుండేదా? నేను... నేను... నిజంగా దురదృష్టవంతుణ్ణి లక్ష్మీ!

(ఏడుస్తున్నాడు)

శార : [ఆ దృశ్యాన్ని భరించలేకపోయింది 'అమ్మా!' అంటూ కేశవరావుదగ్గరలో కూలబడి ఏడుస్తోంది]

(రామారావు మేడపైనుండి వచ్చాడు. మెట్లదగ్గరే నిలబడి క్షణకాలం పరిస్థితిని తిలకించాడు. నిదానంగా తండ్రిదగ్గరకు వచ్చాడు. తండ్రిని చెయ్యిపట్టుకుని "నాన్నా!" అన్నాడు బరువుగా)

కేశ : (కొడుకును చూచి) రామం!

రామా: ఊరుకోండి నాన్నా!

శార : (లేచి నిలబడింది) "అ న్నయ్యా" (వినపడీ పిన పడకుండా అంది)

రామా: [ఆమెవంక అసహ్యంగా చూశాడు. తండ్రిని చెయ్యిపట్టుకుని] రండి. లోనికెళదాం.

[నెమ్మదిగా ఆయన్ను నడిపించుకుని మధ్యవాకిలి నుండి లోనికి వెళ్ళిపోయాడు.

కేశవరావు శారదవేపు ఒక్కసారి జాలిగా చూచి కొడుకును అనుసరించి వెళ్ళాడు.

శారద అక్కడే కూలబడి ఏడుస్తోంది.]

[తెర వెనుక]

—♦ పాట ♦—

ఓ... అభాగినీ

ఇంతేలే నీ జీవిత మిక
జీవిత మిక ఇంతేలే – నీ జీవిత మిక ఇంతేలే

నీవారల నిర్దయతో
పరవారల నిరసనతో
ప్రతివారికి చులకనతో
బతుకంతా వేదనతో
ఎదనిండిన శోకముతో

అడుగడుగున అవమానం
ఆరనిచితిలా నీ హృదయం ॥ఇంతేలే॥

నీ బ్రతుకును గని పరిహసించు పాడులోకం
ఈలోకం- నీకోసం-రాల్చదులే ఓ బాష్పకణం

కాంతిలేని శాంతిలేని
కారుణ్యపు చూపులేని
కఠినత్వం—కర్కశం
హాలాహలముగ-అమవశసిశగ
బ్రతుకు దుర్భరం- నీ బ్రతుకు దుర్భరం....

(పాట వినిపిస్తున్నంతసేపూ ఆమె ఊహాలో ఏవేవో దృశ్యాలు మెదిలినయ్. ఆమె వాటిని భరించలేకపో తోంది. అన్న నిర్దయగా-సమాజం పరిహసిస్తూ - అగౌర విస్తూ - భయంకరంగా ఆమె ముందు దృశ్యాలు! పాట అయిపోయేవరకూ అవే దృశ్యాలు. చివరకు భరించలేక కెవ్వున అరచి పడిపోయింది.)

— తెర —

# శారద

(నాల్గవ దృశ్యము)

[అదే స్థలం—మరునాడు ఉదయం జనార్ధనరావు - రామా రావు విచారంగా కూర్చునివున్నారు.]

రామా: నేను చెబితే విన్నారా మామయ్యా! లాభంఉండ దని అప్పుడే చెప్పానుగా! ఆ కుటుంబరావు దగ్గర మరింత లోకువయ్యాంగదా యిప్పుడు!

జనా: (నిట్టూర్చాడు.)

రామా: ఇక మన కర్తవ్యమేమిటి? (తన్నుతానే ప్రశ్నించు కున్నాడు.)

జనా : (ఏమీతోచక, లేచి అటూ ఇటూ తిరుగుతు న్నాడు. కాస్తాగి) ఆc, శారద ఎలావుంది?

రామా: దానికేం? మనందర్ని పొట్టబెట్టుకుంటేనేగాని దానికి...

జనా: రామం! ఏమిటది! మత్తేమైనా పోశోందా?

రామా: (ఆవేదనతో) ఇక బ్రతికినన్నాళ్ళూ ఈ గుండెల మీది కుంపటి నెలా భరించటం?

జనా: సర్లే ఊరుకో, జరిగినదానికి చెయ్యగలిగేదేముంది?

రామా: అంతేగా! ఇక ఏంజరుగుతున్నా నోరుమూసుకుని పడుండాల్సిందే!

జనా: ఏఁవిటి రామం నువ్వు మరీను? ఏకోవిధంగా సర్దుకు పోవాలిగాని, మనసు పాడుచేసుకుంటే ఎలా?

రామా: మీకు తెలియదు మావయ్యా! శారదతప్పు కప్పి పెట్టుకోవటానికి వీలులేనిది!

[అదే సమయంలో కేశవరావు వచ్చి గుమ్మం దగ్గర నిలబడివున్నాడు.]

జనా: రామం!

రామా: అవును మాఁవయ్యా! శారద యిప్పుడు....

[అనుకోకుండానే తలెత్తి తండ్రివైపు చూశాడు. ఆయనా ఆశ్చర్యంగా కొడుకువేపు చూశాడు. తిరిగి యిద్దరూ తలలు దించేసుకున్నారు. జనార్ధనరావు వారిద్దరి స్థితిని గమనించాడు.]

జనా: ఓరి భగవంతుడా! (కుర్చీలో కూలబడిపోయాడు.)

[క్షణకాలం పూర్తి నిశ్శబ్దం]

కేశ: (నిదానంగా జనార్ధనరావుదగ్గరగా వొచ్చాడు.) జనార్ధనం!

జనా: ఏం బావా?

కేశ: రాత్రి ఎక్కడికి వెళ్ళావ్?

జనా: కుటుంబరావుగారింటికి.

కేశ: దేనికి? [శారదవచ్చి వాకిట్లో నిలబడివుంది. ఆమెనెవ్వరూ చూడలేదు.]

జనా: ఆ కుటుంబరావుతో మాట్లాడి, ఎలాగైనా శారదను శేఖర్ కే ఇచ్చి పెళ్ళిచేయటం మంచిదనిపించింది,

కేశ : (నిర్లిప్తంగా వింటున్నాడు.)

[శారద ఆశతో ఒకడుగు ముందుకు వేసింది.]

జనా: కాని, ఆ కుటుంబరావు సరిగా మాట్లాడటానికే అవకాశమివ్వలేదు. ఆయనభార్యకూడా పాపం-ఎంతో బ్రతిమలాడింది. కాని, ఆయనహృదయం కరుగలేదు. చేసేదిలేక తిరిగి వచ్చేశాను.

శార : (మొహం చేతుల్తోకప్పుకొని లోనికి వెళ్ళిపోయింది)

కేశ : ఇప్పు డేం చెయ్యాలిక! (నెమ్మదిగా తనలోతానే అనుకున్నాడు.)

రామా: (విసురుగా తండ్రికిదగ్గరగా వచ్చాడు. ఏదో అనబోయి ఆగిపోయాడు.)

కేశ : శా....రదా! (కళ్ళల్లో నీళ్లునిండినయ్.)

జనా : నువ్వు లోనికివెళ్ళి విశ్రాంతితీసుకో బావా! అనవసరంగా బెంగపడి చేసేదేముంది?

కేశ : విశ్రాంతి! నా బ్రతుక్కి శాశ్వతమైన విశ్రాంతి దొరికితే ఎంతబాగుంటుంది!

జనా: (ఓదార్చుతూ) ఎందుకు బావా అనవసరంగా మనసు పాడుచేసుకుంటావు? ఇప్పు డేమైందని?

కేశ : ఇంకా ఏంకావాలి జనార్ధనం? (దుఃఖంతో కంఠం పూడుకుపోతోంది.)

రామా: (ఆవేశంగా తండ్రిఎదటికి వచ్చాడు. ఆయన కళ్ళలోనికి తీవ్రంగా చూస్తూ.) ఈ అనర్ధానికంతటికీ బాధ్యత ఎవరిది?

కేశ : రా....

రామా: దీనికంతకూ బాధ్యులు మీరు కాదా?

జనా: (దగ్గరగా వచ్చి) రామం!

రామా: (గద్దిస్తూ) కాదా?

జనా: (వారిస్తూ] రామం! ఏమిటిది?

రామా: [ఆయనవేపు తిరిగి] అవును మామయ్యా! మొదట్నుంచీ తల్లిలేనిపిల్ల అనే పేరుతో అతిగారాబం చేసి, అది ఆడింది ఆటగా పాడింది పాటగా దాని చేష్టలకు తాళంవేస్తూ, దానిమాటలకు మురిసిపోతూ, దాన్ని మందలించకుండా, ఏది తప్పో ఏది ఒప్పో తెలుసుకోలేని అజ్ఞానంలో అహంలో బరువు బాధ్యతలకుదూరంగా దాన్ని పెంచి ఈనాడు విచారించి ప్రయోజనమేమిటి? నే నేనాటినుంచో మొత్తుకుంటున్నాను; ఈ మమకారం దాని బతుకును పాడుచేస్తుందని. నా మాటలు చెవినిపెట్టక పోగా, దాన్ని కొంచెం కోప్పడుతుంటే, తను సమర్థించుకొస్తుండేవారు. ఆ సమర్థింపుకు ఫలితం ఇప్పుడు భయంకరరూపం దాల్చి వికృతంగా నాట్యంచేస్తూ ఎదట నిలబడింది. ఇప్పుడు ఏడ్చి లాభం ఏమిటి? స్వయంకృతాపరాధం! అనుభవించక తప్పుతుందా?

కేశ: [బాధగా] అవును. ఈ తప్పంతా నాదే!

జనా: అబ్బా! పోనీయండర్రా. జరిగింది చాలక పైన ఈ గొడవంతా దేనికి? కొంప మరింతఅల్లరికావటానికా?

రామా: అల్లరికాక, ఈ కొంప కింకా పరువెక్కడ మిగిలింది మాంవయ్యా? ఆ కుటుంబరావు చెప్పి వెళ్లింది సత్యం! బజారుకి కొంపకీ తేడా లేకండా పోయిం దివ్వాల్టితో!

జనా: (మందలింపుగా) రామం!

రామా: (అదే ధోరణిలో) అవును మాంమయ్యా! ఇదిదాస్తే దాగేవిషయమా? రేపట్నుంచీ వీధివీధినా ఈ విషయమే చెవులుకొరుక్కుంటారు! మన వెనకనే వెకిలిగా నవ్వుతుంటారు! అదంతా ఎలా భరించగలం? ఈ మచ్చ నెలా మాపుకోగలం?

కేశ: [కుమిలిపోతున్నాడు.]

జనా: కనుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుందని.... అదంతా తవ్వుకుని ప్రయోజనమేమిటి రామం? ఆయన చూడు ఎలా కుమిలిపోతున్నాడో!

రామా: తల్చుకుంటే గుండెలు దహించుకుపోవటం లేదా మాంవయ్యా! ఈ బ్రతుకెలా ఈడ్చాలిక?

జనా: అలా అనుకుని చెయ్యగలిగేదేముంది చెప్పు?

రామా: అవును ఏముంటుంది? ఏమీ లేదు. మానమర్యాదలు, పరువు ప్రతిష్ఠలు లేని ఈ కొంపలో కూర్చుని భోరున ఏడవటం తప్ప చెయ్యగలిగేదేముంటుంది? ఏమీ వుండదు.

కేశ: (కొడుకుదగ్గిరిగా వచ్చాడు కళ్ళవెంట అశ్రుధారలు ప్రవహిస్తున్నయ్.) రామం!

రామ: [ఆయనవంక చూడలేక మొహం తిప్పుకున్నాడు.]

కేశ: నిజమేరా, నీ మానమర్యాదలే మంటగలిసినయ్! నీ ఒక్కడికడుపే దహించుకపోతోంది! అవమానం నీకే! తలవంపులు నీకే! దీనికి కారణం నేనూ, నా కూతురూ! మా వల్లనే నీ బ్రతుకు నవ్వులపాలయింది. ఈ అనర్థానికి బాధ్యులమైన మా ఇద్దర్నీ ముక్కలుముక్కలుగా నరికిపారవెయ్ నీకు జరిగిన అన్యాయానికి ప్రతీకారంచెయ్యి.

రామా: (ఆవేశం ఎగిరిపోయింది.) నాన్నా!

కేశ: మమ్మల్నిద్దర్నీచంపి, పారిపోతున్న నీ పరువు ప్రతిష్ఠల్ని నిలబెట్టుకో, ఊఁ.

రామా: నాన్నా!

కేశ: అవునురా! సందేహించకు. నేను మాన మర్యాదలు లేని హీనుణ్ని. పిల్లల్ని పెంచటం చాతకాని అప్రయోజకుణ్ణి. అజ్ఞానిని. నీలాంటి మేధావి నా కడుపున పుట్టటం నీవుచేసుకున్న మహాపాపం! ఆ నీచురాలు, కులట నీకు చెల్లెలుగా పుట్టటం... నీ పూర్వజన్మ... [దగ్గుతెర వచ్చింది.]

రామా: (తండ్రిచేతులు రెండూ పట్టుకుని, వణుకుతున్న కంఠంతో) నాన్నా! క్షమించండి నాన్నా! మనసు బాధపడి ఏదో నోటికొచ్చినట్లువాగేశాను.

కేశ: (దగ్గు నాపుకుంటూ) నీవు చెప్పింది అబద్ధంకాదు రామం! నేనే దీనికంతకూ బాధ్యుణ్ణి.

రామా: అలా అనకండి నాన్నా! (ఆయన చేతుల్లో ముఖం దాచుకుని) ఇదంతా నా... ...(ఆవురుమన్నాడు)

కేశ : రామం!

జనా : (దగ్గరగా వొచ్చి విడదీస్తూ) బాగుందిరా బాబూ మీ వరస! ఇలా తయారయ్యారేంవిట్రా చివరకి! ఎవరయినా వింటే, నవ్వుతారుకూడా. రామం! నువ్వు అవతలికెళ్ళు. బావా, మనం లోనికెళదాం కాస్సేపు.

రామా: (సోఫాలో కూలబడి తల రెండుచేతులమధ్య ఇరికించుకుని ఆలోచిస్తున్నాడు.)

జనా : (కేశవరావుని లోనికి నడిపించుకుని వెళుతున్నాడు) ఇంత పిచ్చివాళ్ళయిపోయారేంరా బాబూ!

(శేఖర్ బయటనుండి వచ్చాడు. ముఖం చాలా గంభీరంగా వుంది. అందరూ అతనివంక ఆశ్చర్యంగా చూశారు.)

శేఖ : (రామారావుదగ్గరకు వచ్చి) రామారావుగారూ! నేను కుర్రతనపు ఆవేశంలో మాట్లాడటంలేదు. ఈరోజు నాజీవితంలో ఒక పెద్ద మార్పువచ్చింది. ఈ మార్పు నన్ను—నా వయస్సును మనస్సును పెంచివేసింది. బాగా ఆలోచించినమీదటనే నేను ఒకనిర్ణయానికి వచ్చాను. బ్రతుకు—బాధ్యతలు అంటే యేమిటో అర్థంచేసుకున్న తరాత్వనే మీ ముందుకొచ్చి నిలబడుతున్నాను.

[అందరూ అతనివేపు చూస్తున్నారు]

మీరు అడిగిన ప్రశ్నకు ఇప్పుడు సమాధాన మిస్తు న్నాను. నన్ను నేను అడిగినతర్వాతనే శారదను ప్రేమించుతున్నాను. ఆత్మవిమర్శన చేసుకున్న మీదటనే ఆమెను వివాహంచేసుకోవాలనే నిర్ణ యానికి రాగలిగాను. నా అంతరాత్మ ప్రబోధం తోనే ఈ నిర్ణయం జరిగింది. మానాన్న ఈ పెళ్ళికి వప్పుకోకపోయినా ఫర్వాలేదు. ఆయన మూర్ఖ త్వానికి, పట్టుదలకూ మాఇద్దరిజీవితాలు బలికావ టానికి వీల్లేదు. మీరు చదువూ సంస్కారం అన్నీ వున్నవారు. మేధావులు. నన్ను అర్థంచేసుకోండి. మా వివాహానికి అనుమతిని ఇవ్వండి రామారావు గారూ!

[రామారావుచేతులు పట్టుకుని జాలిగా అతనికళ్ళ లోనికి చూశాడు. అమాయకంగా, నిర్మలంగావున్న అతని కళ్ళు చూసేసరికి రామారావుకూడా చలించాడు. నెమ్మ దిగా అతనిభుజం తట్టాడు.]

రామా: కాని, నీ తల్లిదండ్రులకు ఇష్టంలేకుండా ఈ పెళ్ళి జరపటం—దానివలన అనేక యిబ్బందులున్నయ్ శేఖర్!

శేఖ : ఎన్నిఇబ్బందులున్నా జడవను రామారావుగారూ! ఈ పెళ్ళికి మాఅమ్మగారి అంగీకారంకూడావుంది. పెళ్ళయితే మా నాన్నగారుకూడా వారికొస్తారు. మీరేమీ సందేహించకండి.

రామా: (ఆలోచిస్తున్నాడు)

శేఖ : నన్ను అర్థంచేసుకోవటానికి ప్రయత్నించండి రామారావుగారూ! మీరు యెలా ఆలోచించినా శారదకూ నాకూ వివాహం జరపటం మీధర్మం. మాఇద్దరినీ విడదీయడానికి వీలుకాని మరో అను బంధం మాకుందని మీకూ తెలుసు!
(రామారావు ఉలిక్కిపడ్డాడు.)
ఆ విషయంకూడా మీకు స్పష్టంచేశాను. (కేశవ రావుదగ్గరగా వెళ్ళి) మీరు పెద్దలు, పూజ్యులు. మీకు చెప్పాల్సిందేమీ ఉండదు. స్త్రీగాని, పురుషుడుగాని జీవితంలో ఎవరినోఒకరినే పెళ్ళాడటం జరుగుతుంది. నేనూ శారదా ఏనాడో దంపతుల మయ్యాము. మమ్మల్ని ఆశీర్వదించి ఈ వివాహం జరగటానికి అంగీకరించండి. ఈ వివాహం జరక్కపోతే, నేనూ శారదకూడా యీ లోకంనుండి....
(చేతులు పట్టుకున్నాడు)

కేశ : (ఏమీ చెప్పలేక సతమతమవుతున్నాడు.)

శేఖ : కేశవరావుగారూ! (దీనంగా అన్నాడు)

జనా : (దగ్గరగా వచ్చి, శేఖర్ తల నిమిరాడు. కేశవ రావుతో) చూడు బావా! యేవిధంగా చూచినా వాళ్ళిద్దరికీ వివాహం జరపటమే శ్రేయస్కరం. కుటుంబరావుగారు యివ్వాళ కాకుంటే రేపైనా దారికివస్తారు. నువ్వు సరేనంటే ఈ వివాహం

జరిపించుదాం. ఏమంటావు? నా మాటలు విను బావా, పిల్లా పిల్లవాడు క్షేమంగావుంటే అంతే చాలు. తతిమ్మా గొడవలన్నీ తర్వాత బావా!

కేశ : (గట్టిగా శ్వాసవదిలాడు) సరే కానివ్వండి. అన్నింటికీ ఆ భగవంతుడే వున్నాడు.

జనా : శుభం.

శేఖ : (ముఖం విప్పారింది)

జనా : రామం! మరి నువ్వేమంటావు?

రామా: నేను అనేందు కేముంది మాఁవయ్యా? నాన్నా, మీరూ సరేనంటే, నేను కాదంటానా? అలాగే కానివ్వండి.

[కుటుంబరావు వచ్చాడు]

కుటుం: సరే, అందరూ సరేనంటే నేను కాదనిమాత్రం లాభమేముంది! అలాగే కానివ్వండి.

(అందరూ ఆశ్చర్యంగా చూశారు)

శేఖ : నాన్నా! (సంతోషంగా తండ్రిని కౌగలించుకొన్నాడు.)

కుటుం: ఆఁ నాన్నే! నాన్న! నీమాటముందు నాన్నమాటకు నయాపైసావిలువ లేకపోయిందిగా!

జనా : (చిరునవ్వుతో) అలాగనకండి మరి! ఒక మంచి జరిగేటప్పుడు, ఎవరిమాట నెగ్గినా బాధలేదుగా!

కుటుం: అంతేలెండి మరి! ( కేశవరావుతో ) శాస్త్రోక్తంగా తొందర్లో లగ్నాలు పెట్టించండి. బరువు వొదిలిపోతుంది. మీకూ నాకూనూ.

కేశ : (మందహాసంతో అలాగే అన్నట్లు తలూపాడు.)

జనా : (గట్టిగా శ్వాసలాగి వొదిలాడు) హమ్మయ్య! ఆఁ, అమ్మాయ్ శారదా! (లోనికి వెళ్ళాడు. లోపల నుండి—) నేను చెప్పలా తల్లీ! అంతా మంచే జరుగుతుందని. యిటు చూడమ్మా శారదా! శారదా! ఆఁ! శారదా! (బిగ్గరగా అరిచాడు)

[అందరూ తృళ్ళిపడి లోనికి చూచారు.]

జనా : (లోపలనుండే) ఎంతపనిజేశావు శారదా!

[అందరూ లోనికి పరుగెత్తారు ఆదుర్దాగా]

కేశ : (లోపలే) అమ్మా! శారదా! (ఏడుస్తున్నాడు.)

—♦ పాట ♦—

ఇంతేలే.... ఋణానుబంధం
ఋణానుబంధ మింతేలే
కని పెంచిన మమకారాలే
కనుకొలుకుల రాల్చేను
బాష్పకణాలు
ఎవరికి ఎవరో ఈ జగతిని
ఎరుకరాదోయ్ విధివిలాసం
ఋణానుబంధం ఇంతేలే.... ....

[జనార్ధనరావు, కుటుంబరావు, కేశవరావుగారిని నెమ్మదిగా నడిపించుకొస్తున్నారు. కేశరావుగారు ప్రతిమలా నిలబడిపోయారు. వారివెనుకనే, శేఖర్ మొహం వేలాడేసుకుని వచ్చాడు.

రామారావు చేతులమీద శారదను తీసుకువచ్చి సోఫాలో పరుండబెట్టాడు.

పాట ఐపోయేసరికి ఇదంతా జరిగింది.]

జనా : (కేశవరావును కుర్చీమీద కూర్చుండబెడుతూ) ఇలా కూర్చో బావా!

కేశ : (ఏభావాన్ని వ్యక్తంచెయ్యడంలేదు. బొమ్మలా కూర్చున్నాడు.)

రామా: ఇంత ఘోరానికి తలపడతావని కలలోకూడ అనుకోలేదు శారదా! (ఏడుస్తున్నాడు)

జనా : (చివాలున అతనికిదగ్గరగా వచ్చి) అవును ఎలా అనుకుంటావు? నీ వసలు ఆమెను అర్థంచేసుకోవటానికిగాని, ఆమె అభిప్రాయం తెలుసుకోవటానికి గాని ప్రయత్నంచేస్తేగా?

రామా: మాంవయ్యా!

జనా : నీవేకాదు. ఎవ్వరూ శారదను అర్థంచేసుకోలేదు. మీరందరూ—నీవూ—నీ తండ్రి, [శేఖర్‌ను చూపుతూ] నీవూ, మీరంతా ఆమె నొక కీలుబొమ్మగా భావించారు. మీ అభిమతాలకు అనుగుణంగా ఆమెను మార్చటానికే ప్రయత్నించారు. కాని, ఆమే ఒకప్రాణమున్న మనిషనీ, ఆమెకూ స్వంతఅభిప్రాయాలు అంటూ వుంటాయనీ, మీరెవ్వరూ గుర్తించలేదు. మీ అందర్నీ ఆమె సమంగానే ప్రేమించింది గౌరవించింది! కన్నతండ్రి రక్తంపంచుకు పుట్టిన అన్న, ప్రేమించిన ప్రియుడు

అందరూ ఆమెకు కావాలి. కాని, మీకో! మీలో ప్రతిఒక్కరికీ ఎవరికి వారికే ఆమె స్వంతం కావాలి. అన్న కావాలంటే ప్రియుడుండటానికి వీల్లేదు. ప్రియుడు కావాలంటే అన్న దక్కడు. తండ్రికోసం ప్రేమను త్యాగంచెయ్యాలి. ప్రేమకోసం తండ్రిని వొదులుకోవాలి! ఈ సంఘర్షణకు ఆమెమనసు నలిగిపోయింది. ఈ తుఫానుకు ఆమెహృదయం తల్లడిల్లింది. (కుటుంబరావువుచు చూచి) మీరంతా మీ పంతాలు నెగ్గించుకోవటానికే ప్రయత్నించారు. ఆమె బ్రతుకు మంటగలిసిపోతున్నా మీకు కనికరం లేకపోయింది. మీఅందరి పట్టుదలలకు ఆమె బలయిపోయింది. మీ బలవంతాలకు తల వొగ్గలేక ఆమె అమూల్యమైన తనజీవితాన్నే త్యాగం చేసింది.

[రామారావు కుమిలిపోతున్నాడు. శేఖర్ కళ్ళ వెంట అశ్రుధారలు ప్రవహిస్తున్నయ్. కుటుంబరావుకళ్లు చెమ్మగిల్లినయ్. కండువాతో కళ్ళు వత్తుకున్నాడు.

కేశవరావుగారిభావాలు తెలియుటంలేదు. ఆయన మొహం మరోపక్కకు (వెనక్కు) త్రిప్పుకుని కూర్చుని వున్నారు.]

జనా : (చేతిలోవున్న కాయితపుమడత విప్పుతూ) వినండి. శారదహృదయం ఎలాంటిదో! బ్రతికి వున్నాళ్ళూ ఆమెను అర్థం చేసుకోలేకపోయినా,

ఇప్పుడైనా ఆమె నర్థంచేసుకొనేందుకు ప్రయత్నిం చండి.

[శారద వ్రాసిన ఉత్తరం చదువుకున్నాడు.]

* "నాన్నా!

అమ్మ లేకున్నా. ఆ వెలితి నే నెన్నడూ అనుభవించలేదు. అమ్మా, నాన్నా అన్నీ నీవై నన్ను పెంచావు. నామాటను నీవు ఏనాడూ కాదనలేదు. కాని వివాహం విషయంవచ్చేసరికి, మనమధ్య అభిప్రాయాలు భేదించాయి. జనార్ధనంమామయ్యకూ నీకూ గల ఆత్మీయత, అనుబంధం నాకు తెలుసు. నన్ను సూర్యంబావకిచ్చి పెళ్ళిచేస్తే, రెండుకుటుంబాలమధ్యన అనురాగలత పెరిగి పెద్దదయి శాశ్వతంగా పెనవేసుకుంటుందని మీరాశించారు. కాని ....హృదయం శేఖర్‌కు అర్పితమైవుంది. దానిని మరల్చుకునేశక్తి నాకులేదు. ఆమాట మీకు చెప్పగల సాహసం లోపించింది నాలో! అన్నయ్య తన వాక్చాతుర్యంతో నన్ను భయపెట్టినా, నోరు కట్టివేశాడు. అన్నయ్యకు మాట ఇచ్చినప్రకారం, నామనసులోని ఆలోచనలు చెరిపివేసుకో ప్రయత్నిస్తున్న సమయంలో శేఖర్ వచ్చి, నాలో తుఫాను

---

* నాటకసమాజాలకు సూచన :— శారద వ్రాసిన ఉత్తరం జనార్ధనరావుగారిచేతిలో వుంచి, శారదగొంతుకతోనే తెరలో చదివిస్తూ, తదనుగుణంగా రంగమ్మీదివారి భావాలను ప్రదర్శింపజేయటం బాగుంటుంది.

రేపాడు. ప్రేమకూ బాంధవ్యానికీ వచ్చిన సంఘర్షణలో, తనలాగే, నేనూ కన్నతండ్రిని త్యాగంచెయ్యవలసిన అవుసరం కల్పించాడు! శేఖర్ నిష్కల్మషంగా నన్ను ప్రేమిస్తున్నాడు. నాకోసం అన్నింటినీ వదులుకోవటానికి సిద్ధపడ్డాడు. ఆయ న్నెలా తిరస్కరించగలను? న్యాయంగా ఆలోచిస్తే అతను నాకు భర్త! ఆయనమాటను కాదనేహక్కు నా కెక్కడిది?

అందువల్లనే ఇష్టమున్నా లేకున్నా ఆయ న్ననుసరించి వెళ్ళిపోవటానికి సిద్ధపడ్డాను. కాని, పరిస్థితులు మరోలా మారినయ్.

ఇంత అనర్థకం జరిగాక, నాగతేమిటి? కుటుంబరావుగారి పట్టుదలమూలంగా నా శేఖర్ నాకు దక్కడని తెలిసిపోయింది. యిటు సమాజంలో నా బ్రతుకు హీనమయింది.

అడుగడుగునా అవమానాలతో మీ తలలు వంచుకునేలాచేస్తూ, కలకాలం మీ గుండెలమీాది కుంపటిలా బ్రతకటం ఇష్టంలేకనే ఈ తనువు చాలిస్తున్నాను.

నా తప్పులుంటే మన్నించండి.

అభాగిని,

మీా శా ర ద !"

[ఉత్తరం పూర్తయ్యేసరికి కుటుంబరావు నెమ్మదిగా వీధివాకిలివరకూ వెళ్ళిపోయాడు తలవంచుకుని.

శేఖర్ యేడుస్తూ శారదకు దగ్గరగా కూలబడి పోయాడు.

రామారావు కన్నీరుకారుస్తూ మేడమెట్లదగ్గరగా వెళ్ళి నిలబడిపోయాడు.

కేశవరావు భార్యఫొటో కెదురుగా వెళ్ళి ఫొటో లోనికి చూస్తూ నిలబడివున్నాడు. ఆయనలో కన్నీరుకూడా ఇంకిపోయింది.)

జనా : (ఉత్తరం పూర్తిజేసి మధ్యలో నిలబడి అందర్నీ ఒక్కసారి చూశాడు) ఇప్పుడు చెప్పండి! శారద ఎందుకు మరణించింది? కాదు, యెందుకు హత్య చేయబడింది! యెవ రామెను చంపింది? యెవరు? యెవరు?

(అందనీ అడిగాడు. యెవరినోటికెంటా జవాబు రాలేదు. అందరూ తలలు వంచుకున్నారు.)

జనా : మీరు—మీరు—కాదు—మనమందరం కలిసి ఆమెను పొట్టబెట్టుకున్నాం. శారదా! (శారదకు దగ్గరగావెళ్ళి, పైకండువా తీసి ఆమెకు కప్పుతూ మొహం చేతులతో కప్పుకుని ఏడుస్తున్నాడు]

కేశ : (నెమ్మదిగా) నిజమే లక్ష్మీ! నీ శారదను, నీ చిట్టి తల్లిని నేను....[దగ్గుతెర వచ్చింది. మాట పెగ ల్లేదు. భయంకరంగా దగ్గుతున్నాడు.]

జనా : బావా! (అంటూ దగ్గరగా వెళ్ళాడు)

కేశ : (దగ్గుతూనే మధ్యగుమ్మంలోనుండి లోనికి వెళ్ళబోయాడు. వాకిలిదాటుతుండగా, దగ్గు ఎక్కువై గుండెలు బ్రద్దలయినయ్. విరుచుకుని గుమ్మం పైనే పడిపోయాడు.)

రామా: నాన్నా!

జనా : బావా!

(నలుగురూ ఆయన్ను సమీపించారు. తెర జారుతుంది. దూరాన్నుండి విషాదంగా ఆలాపన.)

సమాప్తం.

92



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA120B135 |
| పుస్తకం పేరు | శారద |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 93 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 4 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | B. Jayamma |
| పేజీలు విడదీసినది | P. Jayamma |
| స్కాన్ చేసినది | Aswini |
| పరీక్ష చేసినది | PRATHYUSHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | NO |
| పరిస్థితి | good |